# మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం
# మీ పైర్లకు అవసరం విజయ్

పిల్లలు ఆరోగ్యంగా వుండాలంటే పుష్టికరమైన ఆహారాన్నివ్వాలి అట్లాగే పైరు మొక్కలకు నత్రజని, భాస్వరం, పొటాష్‌లతో కూడిన పోషక పదార్థాలు అందజేయాలి. అప్పుడే పంటదిగుబడులు బాగుంటాయి, రాలుబడి ఎక్కువౌతుందికూడా

ప్రస్తుతం ఎరువుల ధరలు పెరిగిపోయిన మాట వాస్తవమే అందుచేత ఖర్చులు తగ్గించుకోడానికి వరిపైరుకు యూరియా మాత్రమేవేస్తే సరిపోదా అని మీలో కొందరు అనుకోవచ్చు కాని యూరియా మాత్రమే వేస్తే .వరి మొక్కలలో చీడలు, తెగుళ్ళ నిరోధక శక్తి తగ్గిపోతుంది అంతేకాదు పైరు నీటి ఎద్దడిని తట్టుకునే శక్తినికూడా కోల్పోతుంది భూసారం కూడా క్రమేణా తగ్గి పంటదిగుబడులు క్షీణించిపోతాయి.

భాస్వరం, పొటాష్‌లు వాడినపుడే మొక్కలు నత్రజనిని గ్రహించుకోగలుగుతాయి. ఈ మూడు పోషక పదార్థాలు వాడితే పైరు మొక్కలు బాగా ఎదిగి, అధికరాలుబడి, అధిక లాభాలు వస్తాయి ఈ విషయాన్ని ఋజువుచేసిన పరిశోధనా ఫలితాలను పరిశీలించండి.

## వరిపంట

| వేసిన పోషక పదార్థాలు | ఎకరాకు దిగుబడి (75 కిలోల బస్తాలు) | ఎకరాకయ్యే సాగుబడి ఖర్చు రూ | ఎకరాకు రాబడి రూ |
|---|---|---|---|
| 50 కిలోల నత్రజని | 20 | 1080 | 1200 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం | 29 | 1255 | 1740 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం + 25 కిలోల పొటాష్ | 32 | 1300 | 1920 |

పై వివరాలనుబట్టి చూస్తే నత్రజనితోపాటు వరి పైరుకు భాస్వరం పొటాష్‌లను కూడా వేయడంవల్ల అదనంగా అయ్యే ఖర్చు ఎకరాకు రూ. 220/-. అయితే దీనివల్లవచ్చే రాబడి ఒక నత్రజనిని మాత్రమేవేస్తే వచ్చిన రాబడికన్నా రూ. 720/- ఎక్కువ. ఇదే విధంగా యితర పైర్లకు కూడా విజయ్ 17-17-17 వాడినట్లయితే అధిక దిగుబడి అధిక లాభాలు పొందవచ్చు. విజయ్ 17-17-17లో నత్రజని, భాస్వరం, పొటాష్ పోషక పదార్థాలు సమపాళ్లలో వున్నాయి.

పొటాష్ ఎక్కువగావున్న భూములకు అనువైన ఎరువు విజయ్ 24-24-0. విజయ్ కాంప్లెక్స్‌లతో బాటు పైరుమీద చల్లడానికి విజయ్ యూరియా బాలా అనువైనది.

**విజయ్ ఎరువులను వాడండి—అధిక లాభాలను పొందండి.**




విపులంగా తెలుసుకోవాలంటే యీక్రింది చిరునామాకు వ్రాయండి.
ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్ కాలనీ, హైదరాబాద్-500 028






MFL-1162

# లోకం పోకడ — ఊమెన్











**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 25–6–'76
నలనామ సం॥ జ్యేష్ఠ బ॥ త్రయోదశి
*సంపుటము 69 సంచిక 42*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు. 33–80
ఆరుమాసాల చందా – రు. 16–90
విడి ప్రతి వెల 60 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక



**కథలు**

# ఉత్తరాలు

### అట్టమీద బొమ్మ

శ్రీప్రియ ముఖచిత్రం (4 6 76) నాటి పత్రిక) అత్యంత ఆకర్షణీయంగా ఉంది ముఖచిత్రాలు ప్రచురించుటలో "పత్రిక" ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరుచుకుంది వచ్చే వారం పత్రిక ముఖచిత్రం ఎవరిదై యుంటుందో అని ఎదురు చూసే పాఠకులు వేలాది మంది ఉన్నారనుటలో సందేహం లేదు

న్యాయపతి రమేష్‌బాబు, (బరంపురం)

### సీరియల్

కనువిప్పు సీరియల్ చదువుతుంటే నాకు చాలా ఆనందంగా వుంది ఇంకా ఎంతో ఉల్లాసంగా ఉంది కథలలో ఆమె ఎవరు చాలా బాగుంది

ఎమ్ సన్యాసిరావు, (తిమిడి)

* * *

"కనువిప్పు" సీరియల్ కథగమనం చాలా చక్కగా వుంది మంచి మంచి సీరియల్స్ ప్రచురిస్తున్న మీకు మా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాము

డి సుధాకరరెడ్డి, (నెల్లూరు)

* * *

ఈ వారం పత్రికలో "కనువిప్పు" సీరియల్‌లో కలిగిన మార్పు హర్షించ తగ్గది ఎంత మంచిగా ఉండాలనుకున్న వయసుతోపాటు వచ్చే హోదా, అధికారముతో మనసులో ఈర్ష్యను ప్రేరేపిస్తుంది అత్తగారి మనస్తత్వాన్ని చక్కగా చిత్రించారు రచయిత్రి వారికి మా ధన్యవాదాలు

'యువతరం' శీర్షిక ఎందుకు వేస్తున్నారో మాకు అర్థం కావటం లేదు

శ్రీనివాస్‌గారి సినిమావార్తలు వారం వారం మమ్మలను అలరిస్తున్నాయి.

జి శాంతి, (ఇలపర్రు)

### కథలు

28—5—76 ఆంధ్రసచిత్రవారపత్రిక ఆకర్షణీయంగా ఉంది కథలలో 'కొనుక్కలేనిది' 'కల్యాణఘడియ' వన్నెంతో ఆకర్షించాయి ముఖ్యముగా శ్రీనివాస్‌గారి సినిమా శీర్షిక పత్రికకు హైలైట్

సయ్యద్‌హుసేన్ (దేవరకొండ.)

### సామాన్యుని సణుగుడు

మానవుడు వైజ్ఞానికంగా ఎంతటి ఘన విజయాన్ని సాధించినా నైతికంగా చాలా దిగజారి పోతున్నాడన్న నగ్నసత్యాన్ని వీరాజీగారు 'సామాన్యుని సణుగుడు'లో వివరించారు

ఈ వారం (4 6 76) కథల్లో "ఆమె ఎవరు" మమ్మలను ఆకర్షించింది

బత్తిన సుబ్బయ్య, నాగరాజ టి., (జమ్మలమడుగు.)

### ధర్మపథం

7-5-76 తేది పత్రికలో "భజగోవిందాన్ని గురించి అనే శీర్షికలో 'కృష్ ధాతువు) నకు అర్థము 'డు' అని వ్రాసినారు అది తెలుగులో అర్థమా? తెలుగువాడు ప్రయాణం చేయున్పుడు శంకరులు భజగోవింద శ్లోకాలు చెప్పినారా? తెలుగు దేశములో గంగానది లేదుకదా

వి ప్రకాశరావు, (హైదరాబద్,

* * *

'కృష్ ధాతువు'కు అర్థాన్ని వ్రాయవేసి 'చేయుట' అనే అర్థాన్నిచే '(డు) కృష్ ధాతువని వ్రాసి ఉన్నాను అందులో 'కృ' కలిపితే జరుగుతుంది 'డు' -ఈ శత్రన్తకాలు అది వ్యాకరణం గొడవ వివరంగా వ్రాస్తే ఎన్నో పేజీలవుతుంది ప్రస్తుతానికి అనవసరం తెలుగు దేశంలో గంగానది ఉన్నదని ఎవ్వరన్నారు ఇది కాశీలోని సమాచారమని రెండో పేరాలో వివరంగా ఉన్నదే! మరొకసారి! శ్రద్ధగా చదివితే. పాఠకులకు సందేహాలు కలుగవని అనుకుంటాను

బులుసు వేంకట రమణయ్య (మద్రాసు)

### కార్టూన్లు

4 6 76 ఆంధ్రసచిత్ర వారపత్రికలోని 'కాటూరి'గారి 'బొమ్మలో బొమ్మ' నేటి స్వాములవారల హృదయాలలో దాగివున్న నిజస్వరూపాన్ని వేలెత్తి చూపించారు ప్రతి చిత్రకారుడు తన చిత్రాల ద్వారా ప్రజలకు ఒక సందేశాన్ని అందించిన నాడే అతడు నిజమైన చిత్రకారుడు

కె దేవదానం (గార్ల)

* * *

కార్టూన్లు మరీ తక్కువగా ఉంటున్నాయి మీ పత్రికల్లో ఇక మీదట ఎక్కువగా వేస్తారని భావిస్తున్నాము

వి జె స్వామి, సూర్యకుమారి, జగదల్‌పూర్ (మ ప)

---

## ఆంధ్రసచిత్రవారపత్రిక

## సినిమా వ్యాసరచన పోటీ

## 'మనసినిమాల్లో తెనుగుభాష'

### మొత్తం మూడు బహుమతుల విలువ రు. 650 లు

| | | |
|---|---|---|
| మొదటి | బహుమతి | రు. 300 లు |
| రెండవ | బహుమతి | రు. 200 లు |
| మూడవ | బహుమతి | రు. 150 లు |

### ముగింపు తేదీ 15–7–'76

★ మన సినిమా సంభాషణలలోను, పాటలలోను కవులు వాడుతున్న తెలుగు భాషను కుణ్ణంగా పరిశీలించి దాని బాగోగులను తెలిపే వ్యాసం 1500 అక్షరాలకు మించకుండా వ్రాసి పంపండి.

★ పోటీలో ఆంధ్రపత్రిక సిబ్బంది, వారి బంధువులు తప్ప పాఠకులందరూ పాల్గొన వచ్చును.

★ సినిమాలు సాహిత్య సేవ చేస్తున్నాయా? భాషాభివృద్ధికి, విస్తరణకు ఎంతవరకు తోడ్పడుతున్నాయి అన్న విషయం వ్యాసాలలో అంతర్గీనంగా చర్చించవచ్చును.

★ వ్యాసాలు సిరాలో కాగితానికి ఒకేవైపు వ్రాయాలి వ్యాసకర్త పూర్తిపేరు, చిరునామా వ్యాసం చివర యిచ్చితీరాలి. కలంపేరు వాడినా చివర పూర్తిపేరు యివ్వడం అవసరం.

★ వ్యాసాలు ది 15–7–'76 లోగా మా కార్యాలయానికి అందాలి

★ చిరునామా కవరుపై స్పష్టంగా యిలా వ్రాయాలి: సినిమా వ్యాసరచనపోటీ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003

★ వ్యాసాలు త్రిప్పి పంపబడవు... స్టాంపులు కవర్లు జతచేయ నక్కరలేదు. —సం

# ఆత్మవిద్య ఆచరణ

ధర్మ పథం

బులుసు వేంకటరమణయ్య



వేదాలు, శాస్త్రాలు మొదలైనవి 'సత్యం వద, ధర్మం చర' అని మంచిని బోధిస్తాయి. అలా బోధించడంతో వాని పని సరి. వాటిని ఆచరించే బాధ్యత ఆచరణలో పెట్టేవాడిప్పైనే ఉంటుంది. అట్లే గురువు ఆత్మసాక్షాత్కారానికి అనుకూలమైన విద్యను బోధిస్తాడు. ఆయన చెప్పిన పద్ధతిలో సాధన చేసి ముక్తిని పొందడం సాధకుని బాధ్యత.

ఆత్మవిద్య అతి రహస్యమైనది. మంత్రాలను గురుముఖాన ఉపదేశం పొందితేనే తప్ప అది స్వయంగా చదువుకుంటే పని చెయ్యని రీతిని ఆత్మవిద్యను గురువువల్ల ఉపదేశం పొందితేనేగాని ప్రయోజనం ఉండదు. ఆ పద్ధతులున్నూ బోధపడవు.

ఒక కర్షకుడు తన పొలాలు చూడడానికి తన ఇద్దరు కొడుకులనూ వెంటబెట్టుకుని వెళ్ళాడు. అతడు ఎత్తుగా వుండి వెడల్పు తక్కువగా ఉన్న ఒక పొలం గట్టుమీదనుంచి వెళవలసి వచ్చింది. ఆ పొలంగట్టు మీదనుంచి జారి పడిపోకుండా ఉండేటందుకు అతను ఒక పిల్లవాని చేతిని తన చేతితో గట్టిగా పట్టుకున్నాడు. రెండవ పిల్లవాడు తండ్రి రెండో చేతిని తాను గట్టిగా పట్టుకున్నాడు.

ఇలా వెళ్ళుతూ వుండగా వారికి ఆకాశం మీద ఎగురుతున్న రంగు రంగుల గాలిపటం అందమైన తోకతో కానవచ్చింది. దగ్గర వున్న ఒక చెరువుగట్టుమీద చేరి కొందరు పిల్లవాళ్ళు దానిని ఎగరవేస్తున్నారు. రసమయంగా వున్న ఆ గాలిపటాన్ని చూడగానే పొలంగట్టుమీద నడుస్తున్న పిల్లవాళ్ళకి ఎంతో ఆనందం కలిగింది. సంతోషంతో చప్పట్లు కొట్టాలనే ఉత్సాహం కలిగింది. తండ్రి చేతిని పట్టుకున్న పిల్లవాడు పట్టు విడిచి రెండు చేతులు చేర్చి చప్పట్లు కొట్టాడు. తండ్రి ఆధారాన్ని విడిచినందున ఆ బాలుడు ఒరిగి గట్టుమీదనుంచి క్రింద పడిపోయాడు. దెబ్బలుకూడా బాగా తగిలాయి.

రెండవ బాలుడు కూడా చప్పటలు సరి చాడు కాని వాడు క్రింద పడిపోలేదు వానిని తండ్రి పట్టుకొని ఉండడంవల్ల

వాడు గట్టుమీదనుంచి జారిపోలేదు. వాడికి ఏ ప్రమాదమూ కలగలేదు.

తండ్రిని నమ్ముకుని అతని ఆధారంతో ఉన్నవానికి అపాయం కలుగలేదు. తాను స్వాతంత్ర్యం అవలంబించినవానికి అపాయం తప్పలేదు.

ఆధ్యాత్మిక విషయంలోనూ ఇంతే.

గురువు నాశ్రయించి, అతనివల్ల ఉపదేశం పొందినవాడు కృతార్థుడు కాగలడే కాని, స్వతంత్రించి తానే చదువుకుని సాధన చేసే వారికి తగిన ప్రయోజనం ఉండదు.

గురుముఖతః ఉపదేశం పొందినప్పుడే అందలి రహస్యాలు తెలుస్తాయి. ఏ యోగాభ్యాసానికయినా గురూపదేశం అవసరం. ఉపదేశం పొందిన తర్వాత స్వతంత్రంగా సాధనను ప్రారంభించవలసి ఉంటుంది.



ఉత్తమనటిగా ఆస్కార్ అవార్డునందుకున్న లూయీస్ ఫ్లెచర్ తన చెవిటి తలిదండ్రులతో 'మీరు నా కలలు నిజమవడాన్ని చూస్తున్నారు' అని చెప్తూండేది. సర్సగా ఆమె నటించిన 'వన్ ఫ్లూ ఓవర్ ది కక్కూస్ నెస్ట్' చిత్రానికి ఉత్తమచిత్రం, ఉత్తమ నటి, ఉత్తమ నటుడు (జాక్‌నికల్‌సన్), ఉత్తమ దర్శకుడు (మిలోస్ ఫోర్మన్) బహుమతులు, మొత్తం నాలుగు ఆస్కార్‌లు లభించాయి. లాస్ ఏంజల్స్‌లో ఈ బహుమతి ప్రదానోత్సవాలు జరిగాయి.



# ఎడారిలో వాన



'ఈ రోజుఆమెమళ్ళీ ఉదాసీనంగాఉంది."

అందమైన ఆ మొఖం – విశాలమైన కనులు, సన్నని పెదాలు – ఎర్ర కలువ రేకులాంటి పెదాలు–నున్న చెక్కిళ్ళు వాడిపోయి ఉన్నాయి. భర్త అనాదరణ ఆమె జీవితాన్ని విషమయం చేస్తుంది.

తన సౌందర్యం, యవ్వనం, పెంచుకున్న ఆశలు, భర్త నుంచి ప్రశంస వినాలని అతి శ్రద్ధగా తను చేసుకునే అలంకారం – అన్నీ కొంగున వున్న చెల్లని రూపాయిలా వ్యర్థం అనిపిస్తున్నాయి.

ఉదయం భర్త ఆఫీసుకు వెడుతుంటే ఏమనుకుందో గాని చక్కగా అలంకరించుకుని అతని దగ్గర కెళ్లింది. ఏ లాలిత్యం కోసం – అనేక సంవత్సరాలుగా తపించిపోతుందో దానిని బహుశా యీ రోజున్నా కనులలో చూడాలనే తపన కావచ్చు. లేదా భర్త నుంచి తన అందం గూర్చిన ప్రశంస కోసం కావచ్చు.

గడిచిన రాత్రి – స్మృతిలో మళ్లీ తనను తాను మరచిపోయింది. గడిచిన రాత్రి ఆమెపై ప్రేమ ఎంతగా కురిసిందంటే ఆ ప్రేమ పాతంలో ఆమె అనుమాన వృక్షాలు నామరూపాలు లేకుండా పోయి – ఆమె హృదయ సరోవరంలో స్వచ్ఛమైన తెల్ల తామరలు వేలాదిగా పూచాయి.

ఆమెను భర్త హృదయానికి హత్తుకొని అధరాలను చుంబించిన ఘడియల్లో – ఆమె మనస్సు చష్మెషాహిలోని నీటిలా స్వచ్ఛంగా

శ్రీ గులాం నబి శాకిర్

[తెనుగు అనువాదం మంజు]

## ఎలుకల అమరత్వం

ఎలుకలు అనన్య సామాన్యమైన సంతాన ఉత్పత్తిశక్తి కలవట. ఓ ఎలుకల జంట ఏడాదికి రెండువేల ఎలుకలను కనగలవట. ఓ ఎలుక ఒకే ఒక రాత్రిలో మూడువందల ఆహార పదార్థాలను రుచిచూడగలదట. ఈ విషయాలు బ్రిటనుకు చెందిన ఎలుకల స్పెషలిస్టు డాక్టర్ కార్నవిల్ అన్నారట వెరీవెల్ ! ఇహా ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ ఎగ్రికల్చరల్ రిసర్చి లెక్కల ప్రకారం భారత దేశంలో అయిదువేల మిలియను ఎలుకలున్నాయట అనగా మనిషికి పదిహేను ఎలుకల వాటా అన్న మాట. ఆంధ్రప్రదేశ్‌లో ఓ ఎలుకల కన్నం విప్పితిరిచి చూడగా 103 ఎదిగిన ఎలుకలు, 296 చిన్న ఎలుకలు దొరికాయట. (జాయింట్ ఫ్యామిలీ) అంతే గాక 30 కిలోల ధాన్యం కూడా ఆ కన్నంలో దొరికిందట. (ఎంత ముందుచూపు ఎలుకలకు ?) ఈ ఎలుకలు సామాన్య విషపదార్థాలకు అతీతంగా తయారయ్యాయని, లోగడ వాటిని చంపిన విషం యిప్పుడా పని చెయ్యలేక పోతోందనీ కూడా శాస్త్రవేత్తలంటున్నారట. (సూపర్‌మౌస్) మన దేశంలో ఎలుకల వల్ల 5000 కోట్లు ఏటికి నష్టము.

ఈ నష్టం ఎలుకలవల్ల, వాటినివారణ ఖర్చుల క్రింద, రోగాలు నివారణ ఖర్చుల క్రింద అవుతోందట. ఎలుకలవల్ల నష్టం 200 కోట్లు అని తేలిందట. ఇండియా యీజ్ రిచ్చెస్ట్ ఇన్ విత్ ది రేట్స్ ! య్యా.

## అద్భుత అభివృద్ధి !

గత సంవత్సరంలో హిందూదేశ అభివృద్ధి

## ఫోక్స్ డైరి

అద్భుతమని, ఆశ్చర్యకరమని, పశ్చిమాసియాహిందూ దేశపు నూతన విధానాలు వగైరాలు చాలా గొప్పగా ఉన్నాయని, ఎటొచ్చీ కొన్ని దేశాలు హిందూ దేశపు విధానాలనుసరిగా జీర్ణం చేసుకోక అపోహలు, అనుమానాలు పడుతున్నారని ప్రపంచ బ్యాంకు వైస్ ప్రెసిడెంటు డాక్టర్ ఎర్నెస్ట్ స్టెరన్ అన్నారట.

## కాటేసిన కలం స్నేహం

ఇటలీపాలియాకు చెందిన ఓ యువకుడు పర

తళ-తళ మెరిసింది. "నా భర్త ప్రపంచం లోని అన్ని భాగ్యాల కంటె మిన్న. అనవసరంగా నేను ఆయనను అనుమానిస్తున్నాను." ఆమె పెదవులు అప్రయత్నంగా నవ్వాయి. స్వచ్ఛమైన ఆ చిరునవ్వుకు ఆమే పులకించింది.

రేయి తీయని కలలతో గడిచింది. కాని - ఉదయం ? ఉదయం తిరిగి అదే పునరావృతమైంది. ఆలోచనల భూతం ఆమె పై ఎక్కి కూర్చుంది. ఆవహించిన ఆ భూతం తిరిగి ఆమెలో సంచలనం కలిగించింది.

'నా సౌకర్యం, యవ్వనం, అంతా వ్యర్థం' కాదు కాదు. ఆమె అంగీకరించటానికిప్పుడే సిద్ధంగా లేదు. గడిచిన రాత్రి జరిగిన ఒక్కొక్క సంఘటన ఆమె ముందు ఉండుండి ప్రత్యక్షమౌతుంది- కొన్ని గంటలే అయినా యుగాలైనట్లనిపిస్తుంది.

ఉదయం అతను ఆఫీసుకు వెళ్లేటప్పుడు చక్కగా అలంకరించుకొని ఆమ్లెట్ — టీ పట్టుక వెళ్లింది. అతను ఎప్పటిలాగానే వందమాటలకు ఒకమాట మాట్లాడేడు- అతను తననుండి ఏదో దాస్తున్నట్లనిపించింది. ఒక్కొక్కసారి అతను అంటున్నట్లనిపించేది.

—"హలీమా రాత్రి ఏదైతే జరిగిందో — మరిచిపో — నన్ను క్షమించు నిజం హలీమా ! చాలా బాధాకరమైన విషయం"— భర్తను ఇలా ఊహించుకొని నవ్వబోయింది గాని ఇంతలో— "నాకీరోజు టూర్ తగలవచ్చు. బహుశః ఇవ్వాళ రాలేనేమో !"— ఊహాలలో నుండి బెదరి వాస్తవంలోకి వచ్చిన హలీమా ఆఫీసుకు పోతున్న అతనిని చూచి నీరుకారి పోయింది.

"స్వార్థపరుడు !" మాటిమాటికి గొణుక్కునేది. ఇది మొదటిసారి కాదు. ఇంతకుముందు కూడా యీరకంగా చాలా సార్లు జరిగింది. గత నాలుగు సంవత్సరాలుగా యీరకమైన వంకలకు ఆమె కోరికలు బలై పోతున్నాయి. సేదతీర్చుకోవటానికి నీడగాని- దాహం తీర్చేందుకు నీరుగాని దొరకని ఎడారిలా ఆమె జీవితం మారిపోయింది. అప్పుడప్పుడు ఎటునుండో ఒక మేఘం లేచేది. చాలి చాలని జల్లు కురిసేది. మళ్లీ అదే ఎడారి. అదే రసహీనమైన జీవితం. అదే వైరాగ్యం. పరిష్కారం కనుచూపు మేరలో కనిపించని చిక్కు సమస్యగా హలీమా జీవితం మారిపోయింది. ఈ చిక్కునుండి బయట పడటానికి తనలో తాను గిల-గిల తన్నుకునేది. ప్రయత్నించిన కొలది ఇంకా సమస్య జటిలమయ్యేది కాని పరిష్కారం దొరికేది కాదు.

ఏదైనా దౌర్భాగ్యురాలి ఫోటోగాని, ఉత్తరంగాని దొరుకుతుందేమోనని అతని జేబులు గాలించేది డైరీ చదివేది. కాని, అక్కడా ఆమెకు నిరాశే ఎదురయ్యేది. ఐనా ఆమె మనస్సు పరి - పరి విధాల పోయేది.

ఒకరోజు గదిలోపలి బేడెం వేసుకొని మాక్బూల్‌తో ఆమె భర్త మాట్లాడుతున్నప్పుడు వారి నవ్వులతో ఆ గది— ఇల్లు ప్రతిధ్వనించేవి. ఆమె తలుపుకు చెవులానించి వారి మాటలు విన్నది.

ఆమెకు వినపడిన మాటలు- అబ్బో ఎంత సిగ్గులేనివి - కుత-కుత లాడిపోయింది హలీమా.

## ఎడారిలో వాన

"ఎంత నీచుడు యీ మాక్బూల్" మళ్లీ ఆలోచనలు ముసురుకున్నాయి. అప్రయత్నంగానే సోఫాలో కూలబడింది. మాక్బూల్‌తో యీయన తిరగటం ఎంత ప్రమాదకరం. చాలా కాలంగా గమనిస్తున్నను యీయన యీ చెడిపోయినవాడి సహవాసం వల్లనే నన్ను అనాదరిస్తున్నాడు. పెండ్లి తరువాత మొదటిసారి మక్బూల్‌ను పరిచయం చేసినపుడు. అతని ఆకలిగొన్న చూపులకు, తన వంటిపై తేళ్ళు, జెర్రులు ప్రాకినట్లయింది. ఏమైనా మక్బూలే యీయనను చెడగొడుతున్నాడు. అనేకసార్లు మక్బూలు స్నేహం మానేయమని చెప్పాలనుకుంది. అతను మంచివాడు కాదనాలనుకుంది. కాని భర్త 'నా ప్రాణస్నేహితుడు' అనే మాటతో ఆమె నోరు శాశ్వతంగా కట్టేసాడు.

ఆమె పరి పరి విధాల ఆలోచిస్తుండగా వారెప్పుడు బయటికి వెళ్ళారో ఆమె గమనించలేదు. ఆమె గదిలో ఏదో వెతుకుతుంది, బహుశః వారి సంభాషణ బాపతు ఏదైనా ఆధారం ఏ మూలలోనైనా దొరుకుతుందేమోనని. ఒకసారి కిటికి తెరిచి చూచింది. వారి అలికిడి కాదుగదా జాడగూడా లేదు. తిరిగి గదంతా కలియచూచింది. మక్బూల్ తాగిన సిగరెట్టు పీకలు తప్ప మరే ఆధారాలు లేవక్కడ. ఒక్క ఊపులో టీ కప్పుల ట్రే ఎత్తుకొని బయలుదేరింది.

భూకంపం వచ్చినట్లు ట్రేలో కప్పులు సాసర్లు గల గల లాడుతుండగా ఆమె అన్య

దాకు సిసిలీకి చెందిన అమ్మాయితో కలంస్నేహం పెంపొందించుకుని అది ప్రేమగా మార్చి ఉత్తరాల్లో తానామెను గాఢంగా ప్రేమిస్తున్నట్టు, వివాహం చేసుకో నిశ్చయించినట్టు వ్రాసి, కనుక ఆమెను రమ్మన్నాడట. తెంగున స్టేషనుకు వెళ్లి ఆమెను చూసి అట్నే వుండిపోయాడట. ఆమె బుల్లి రాక్షసిలా, చిన్న సూర్పణకలా వుందట. తానామెను వివాహం చేసుకుంటానని రాసిన ఉత్తరాలు మెడకుచుట్టుకుపోయి, ఏం చెయ్యాలో తెలియక వో బేరానికి వచ్చి తన ప్రేయసిని వరించి, వివాహం చేసుకోదలచినవానికి ఒక మిలియన్ లైర్లు (అంటే మన డబ్బుల 11,700) అంతేగాక, హనీమూన్ వెళ్లి రాడానికి టిక్కెట్లు, వసతులూ కూడా యిస్తానన్నాడట. అంతా బానే ఉంది. కానీ, యింత కలవాణ్ణి ఆ సిసిలీ చిన్నది వదలద్నటా!

## పొగరాని వంటబొగ్గు

భారత్ కుక్కింగ్‌కోల్ లిమిటెడ్ (చండీఘర్) విజయం సాధించారట. వీరు యీ బొగ్గును పాలీథిన్ బ్యాగులలో పెట్టి ఈ ఏడు డిశంబరు నుంచీ ఢిల్లీ, మద్రాసు, చండీఘర్‌లలో విడుదల చేస్తారట. ఈ బొగ్గు ఎంత మంటవచ్చినా పొగరాదట హర్రే! మరినిప్పులేంటే పొగరాదన్న సామెతేంగాను.

## తల్లీ కూతుళ్ల ఆత్మహత్య!

తిరుచెంగోడు నారాయణపాలయానికి చెందిన మారిముత్తు గవుండర్ అనే ఆయన భార్య 35 ఏళ్ల చిన్నమ్మ, 16 ఏళ్ల రాజాతి అనే ఆమెకూతురు మెయిన్‌రోడ్డు. పక్కనున్న చింతచెట్టుకు ఉరి పోసుకుని నిండు ప్రాణాలు తీసుకున్నారట. ఈ దారుణానికి కారణం ఏమిటో యింకా తెలియలేదు.

## హత్యల్లో హాట్ ట్రిక్!

ధారాపురానికి చెందిన 25 ఏళ్లమణి అనే కుర్రాడు, తిలకరాణి అనే అమ్మాయి భార్యాభర్తలుగా చాలాకాలంగా కాపురం చేస్తున్నారట ఒక రోజు రాత్రి వారిద్దరూ, మణితల్లి కందమ్మ ముగ్గురూ కలిసి వో హోటలులో హాయిగా భోజనం చేసి, ఇంటికి బయలుదేరేసరికి దారిలో ఎవరో వో ముగ్గురు వారిని ఆపి, నడిరోడ్డుమీద అంతా చూస్తుండగానే కత్తులతో పొడిచి, చంపివేశారట. ఆ ముగ్గురిలో ఒకడైన సుకూమ్మార అనేవాడు తిలకరాణిని ఎవరూలేని సమయంచూసి బలాత్కరించబోయేంతలో మణి వచ్చి అతన్ని చితకబాదినట్టు ఆ కోపముతో అతను మరో ఇద్దరి సహాయంతో యీ హత్యచేసినట్లూ తేలిందట.

మనస్సుతో మధ్య హాలులోకి వచ్చింది.

మధ్య హాలులో వున్న నిలువెత్తు అద్దంలో తన నీడ గాలిలో తేలియాడుతున్నట్లనిపించింది. హలీమా తిరిగి అదేరకంగా నడిచి చూసుకుంది. యీ కొద్ది జీవితం. ఎంతో మానసిక సంఘర్షణ పడిన తరువాత కూడా ఆమె రూప లావణ్యాలు లవలేశమైనా తగ్గలేదు.

విశాలమైన కనులలో కాంతిగాని — చెంపలపై నునుపుగాని, తెల్లని తెలుపు గాని ఏమీ తరగలేదు. చెక్కినట్లున్న తనముక్కుపై దట్టని భ్రుకుటి- విచ్చిన గులాబితో తనను తాను పోల్చుకొని గర్వపడింది. తన యవ్వనానికి అందానికి మురిసిపోయింది.

ఆమెను మళ్లీ ఆలోచనలు ముసురుకున్నాయి. కొద్ది క్షణాల క్రితం ఆమె ప్రతిబింబమున్న అద్దంలో ఇప్పుడు ఆమె బాల్య స్నేహితురాలు షబ్నమ్ ప్రతిబింబం తనను నవ్వుతూ పలుకరిస్తుంది.

చిన్నతనం — ఏమీ తెలియని రోజులు. తిండిని గూర్చి తప్ప మరే ఆలోచన లేని కాలంలో తన ప్రాణం. ఒక్క క్షణం విడిపోయి ఉండేవారు కాదు. ఇలాంటి సమయాల్లో తనను ఊరట కలిగించేది.

"హలీమా! ఇప్పుడెలా ఉన్నాడే నీ భర్త?"

హలీమా ఆలోచనలో పడింది. అదే పాత ప్రశ్న. అప్పుడేం చెప్పిందో సరిగ్గా గుర్తు లేదు. కావచ్చు బహుశా అనుభవంలేని ఆడది అన్నట్లే- భర్త సుగుణాలను ప్రేమను తెగ పొగిడి ఉంటుంది.

అవును షబ్నం నవ్వి అన్నది. "బాగా చూచుకునే చెప్తున్నావా? ఏదో అనేస్తున్నావా?"

ఎంత బాధ పడింది ఆ రోజు షబ్నం మాటలకు. హలీమా మనస్సులో తిరిగి తుఫాను లేచింది. 'కాదు — వాడు — ఉత్త తిరుగుబోతు - లుచ్చా - వాడితో నా కోరికలు తీరవు' — దాదాపు అరిచింది.

"కాని ఎందుకు? నీలో ఏ లోటుంది. నీ అంత అందమైన ఆడది వాడికెక్కడ దొరుకుతుంది" షబ్నం తనని నిలవదీసి అడుగుతున్నట్లనిపించింది.

హలీమా దగ్గర యీ ప్రశ్నకు ఏరకమైన సమాధానం లేదు. అద్దం ముందు మన్ను తిన్న పాములా నిలుచుండిపోయింది.

"చెప్పవేం? నీలో ఏలోటుంది. దేనికోసం అతను వెంపరలాడుతున్నాడు."

హలీమా గజ-గజ లాడిపోయింది. పిచ్చిగా అరిచింది. "లేదు—నాలో ఏలోటూ లేదు. వాడు లుచ్చా తిరుగుబోతు. బయట వాడికేమీ దొరకని రోజు వాడి ఆకలి తీర్చుకోవటానికి ఆకలిగొన్న తోడేలులా నా దగ్గరకు వస్తాడు. చెమటతో ఆమె తడిసిపోయింది. ఎక్కడో పిడుగుపడ్డట్లు ఒక పెద్ద ఉరుము విన్నట్లు వణికిపోతుంది — అద్దంలో షబ్నం లేదు. గదిలో తను తప్ప మరెవరూ లేరు.

ఏదో నిర్ణయాని కొచ్చినట్లు గదిలోనుండి స్నానాల దొడ్డిలోకి పోయింది. మక్బూల్ రూపం ఆమె కనుల ముందు మాటి—మాటికి ప్రత్యక్ష మౌతుంది. అతని ఆకలిగొన్న చూపులు ఇప్పుడు హలీమాకు ఎంతో తృప్తి నిస్తున్నాయి. భర్తపై పగ తీర్చుకోవటానికి మక్బూల్ ఉత్తమ సాధనం. ఈ రకమైన ఆలోచనలతో శరీరం వేడెక్కి పోతూంది.

స్నానంచేసి ట్రంకులోనుండి పెండ్లినాటి 'యెజారు' వేసుకొని అద్దం ముందు అలంకరించుకోవటానికి కూర్చుంది. అద్దంలో ప్రతిబింబాన్ని ఒకసారి వెక్కిరించింది. ఆ విలువైన దుస్తులలో ఆమె తనను తాను పరీక్షించుకొని తన అందానికి ముగ్ధురాలై పోయేది. వెంటనే వణికిపోయేది.

ఎవరో వస్తున్న అలికిడైంది. ఆమె భర్త తలుపు తీసి లోనికి వస్తున్నాడు. హలీమా కదలకుండా ఒక చూపు విసిరింది. తిరిగి తన అలంకరణలో లీనమై పోయింది. 'బయట ఏమీ దొరకలేదేమో - తిరిగివచ్చాడు' అనుకుంది.

ఒక నిమిషమాగి తిరిగి భర్తనుచూచింది. ఎత్తైన విగ్రహం సుందరమైన రూపం. విశాలమైన ఛాతీ. పొడువైన ముక్కు. పెదవులపై మాసిపోని చిరునవ్వు. ఎంత అందమైనవాడు నాభర్త. ఆమె శరీరం తిరిగి తపించి పోయింది.

అతను ఆకలిగొన్న తోడేలులా ఆమెదగ్గరకు చేరాడు. ఏదో మూలనుండి ఒక మబ్బు తునకలేచినట్లు హలీమా ఎడారి జీవితంలో వర్షం కురువబోతున్నట్లు అతను హలీమాను హృదయానికి హత్తుకుని అధరాలపై అధరాలు ఉంచాడు.

తిరిగి హలీమాలో ఆలోచనల సుడులు తిరిగాయి. 'నా భర్త — ప్రపంచపు అన్ని భాగ్యాలకన్న మిన్న. అనవసరంగా నేనాయన్ని అనుమానిస్తున్నాను' ఆమె అప్రయత్నంగా నవ్వి— భర్త బాహువుల్లో కరిగిపోయింది.






"క్రొంప మునిగిపోయిం ద్రోయ్!"

తలుపులు ఢభేలున తెరుచుకుంట్లూ లోపలికి వూడి పడ్డాడు రాధగాడు.

హుషారుగా జరుగుతున్న ఆటకి ఆటంకం అందరూ ఒక్కసారిగా దహినే దేఖ్‌లూ, బాయే దేఖ్‌లూ చేసి, వాడివైపు చూశాం. ఒగురుస్తూ మంచంమీద కూలబడ్డాడువాడు. ఏంవైనా చెప్తాడేమోనని వాడ్నే చూస్తున్నాం. వాడుమాత్రం తెగ ఒగిర్చేస్తున్నాడు.అందరం కూడా మొత్తానికేదో ప్రమాదం జరిగిందని శంకించాం.

వాడికేసే చూస్తూ, యథాలాపంగా చేసినట్లు చేతిలో ముక్కలు దించేశాను నేను. మిగతా ముగ్గురూ కూడా నన్ను 'ఫాలో' అయ్యారు, నా ఆట పోయేలాగుంది. రాధాగాడి రాక నిజంగా నాకు లోలోపల ఆనందంగానే వుంది.

నెమ్మదిగా లేచి, వాడి ప్రక్కన మంచంమీద కూర్చుంటూ, వాడి భుజంమీద చెయ్యేసి, 'ఏంబ్రా?' అన్నాను.

వాడు నెమ్మదిగా సద్దుకూర్చున్నాడు.

అందరూ ముందుకు వంగి, విశ్వరూప సందర్శనమైనట్లు, కన్నార్పకుండా, చెవులు రిక్కించి, వాడ్నే చూస్తున్నారు. వాడు గొంతు సవరించుకున్నాడు. అనుకుని చేసినట్లు. అంతా ఒఖ్ఖసారే ఓ అరడుగు ముందుకు జరిగారు.

"మంచినీళ్లు..." అన్నాడు వాడు.

"ఛీ..." అన్నారు మళ్లీ అంతా ఒక్కసారే. విసుక్కుంటూ లేచి. గబగబా కూజా తీసుకొచ్చి, వాడికి అందించాను. వాడు దాన్నెత్తి గడగడా త్రాగి, 'అమ్మయ్య' అని, ఓసారి త్రేన్చి, అందరివైపు ఓసారిచూశాడు.

"మురారిగాడి కథకి ఫస్టుప్రైజొచ్చిందట..."

వత్తికాలి బాంబు ప్రేలింది.

పైకప్పు మా తలమీద కూలిపోయింది.

మా క్రింది భూమి అతి వేగంగా పాతాళంలోకి జారిపోతోంది.

"మద్రాసులో సాహితీ సంస్థేదో యీ పోటీ నిర్వహించిందిట. రెండొందలు రూపాయల క్యాష్ ప్రైజది. పైగా ఈ కథని ఆ 'కాంతి' పత్రిక వాళ్లు ప్రచురిస్తారట త్వరలో"



# జెలసీ

తులసి బాలకృష్ణ

నా మెదళ్లో ఎవరో ఆగి, ఆగి గసిక దిగ్గొడుతున్నారు.

అందరి పరిస్థితీ అలాగే వుంది.

“రామ్మూర్తిగారు చెప్పేదింకాక, నిన్న పేపర్లో వచ్చిందిటే న్యూసు. ఆ విజయోత్సాహంతో నిన్న రాత్రికి రాత్రి యింకో కథ కూడా రాసిపెట్టేసేను.” — బాధగా చెప్తున్నాడు రాధాగారు.

అందరూ ‘మన కర్తవ్య మేమిటిప్పుడు’ అన్నట్టుగా నావైపు చూస్తున్నారు. వెన్ను నిగా రెండు గోడవారగా నిలబెట్టి, దానికి జారగిలపడి, కళ్లు మూసుకుని, కణతల మీదకి చెయ్యి పోనిచ్చాను. పెదాలకు ఏదో తగుల్తోంటే నెమ్మదిగా కళ్లు విప్పాను. సిగరెట్టు! ఎవరో ఆపద్బాంధవుడు నా పెదాల మధ్య సిగరెట్టుంచి, అగ్గిపుల్ల వెలిగించారు. ఆ అమృత హస్తం ఎవరిదా అని చెయ్యిపొడవునా చూసుకుంటూ, ముఖంలోకి చూశాను. ఓ క్షణం చిరునవ్వు చిందించాడు హాసింగ్. కళ్లతో కృతజ్ఞతలు చెప్పి, మళ్లీ ఆలోచనలో పడ్డాను. మిగిలిన ఐదుగురూ మౌనంలో పడ్డారు.

“ఇంతలోనే వీడింత కొంపలుముంచేస్తాడని కల్లోకూడా అనుకోలేదుగురూ!” —బాధగా అన్నాడు చక్రి.

“ప్రైజొచ్చినంతలో మనకి పెద్ద ప్రమాద మేమీలేదుగాని, “కాంతి” లోవస్తే యిందంటే మాత్రంవాడికి కళ్లు నెత్తికెక్కిపోతాయి. వాడికేమిటి ఎవరికైనా అంతే. ఆ పత్రికలో కథపడ్డం అంత సులభంకాదు”— అనుభవం మీద మూర్తిగాడు అప్పారావు, తన తిరిగొచ్చిన కథల్ని తలుచుకుంటూ.

“మన కళ్లముందే తిరుగుతూ అసలి వెధవ అంత ప్రైజు కొట్టేసేంత మాంచికథ ఎప్పుడు రాసేడని ? !!” — ఆశ్చర్యంతో కూడిన బాధతో హాసింగు.

“ఏదో నాటకాలంటూ తిరుగుతున్నాడనా, వీడిబొంద ఎన్నినాటకాలాడితే వీడికి పేరు ప్రతిష్ఠలొచ్చిచస్తాయిలే అనుకున్నాం. అంతకీ మన శాయశక్తులా వాడికి సహాయ నిరాకరణోద్యమం జరిపి, వాడు మన పరిధిని దాటిపోకుండా వీలయినంతగా జాగర్తపడుతూండగానే, వీడిదుంపతెగ - యిలా మనకింత ఘోరం తలపెడతాడని కల్లోకూడా అనుకోలేదురోయ్ దేవుడోయ్” — ఏడుగారిపోతూ అన్నాడు చక్రిగాడు.

# జెలసీ

గొంతు సవరించుకున్నట్లుగా నేను దగ్గాను.

మాటలాగిపోయాయి.

చక్రీ మళ్ళీ ఏదో అనబోయాడుగానీ, సింగు వాడి నోరు నొక్కేసాడు. "నోర్మూయ్యరా! గురూ ఏదో చెప్తున్నాడూ..." అంటూ.

నేను మంచందిగి; నాటకాల అలవాటు ప్రకారం గదిలో అటూ యిటూ మూవ్‌మెంట్సు తీసుకుంటూ, మాట్లాడ్డానికుపక్రమించాను.

చాపమీద కూర్చున్న మిత్రబృందానికి ఏ ఏంగిల్‌లో కూర్చుంటే నన్ను యీజీగా ఫాలో అవచ్చో అర్థంగాక, మెడల్ని తిరగలి రాళ్ళల్లా తిప్పుతూ కష్టపడి పోతున్నారు.

"ఇన్నాళ్ళూ మనతోనే వుద్యోగంచేస్తూ, మనలోనే ఆడ్తూ, మనతోనే నాటకాలు వేస్తున్న మురారిగాడు యీనాడు మనని మించిపోయాడని కదూ మనం ప్రస్తుతం బాధపడుతున్నదీ..." తల పంకిస్తూ, పచార్లుచేస్తూ, సాలోచనగా అన్నాను.

ఏదో 'సొల్యూషన్' చెప్తాతా ననుకున్న శ్రోతలకి ఆశాభంగం కలిగింది. వాళ్ళ ఏకాగ్రత కొంచెం సడలింది. కాని వాళ్ళకి నామీద గురి, భయం, గౌరవం వుండటంతో వాళ్ళ మనోభావాలు బహిర్గతం కాకుండా జాగర్తపడ్డారు.

"ఆమధ్యనేదో నాటిక గీకాడు — ఆడాం. ఏదో అసోసియేషన్ అన్నాడు— చేరాం. కాంపిటీషన్స్ అన్నాడు— పాల్గొన్నాం; ఈ నాటకాల్లో వాడు ఎంతగా తంటాలుపడ్డా యీపేటదాటి, మహా అయితే యీవూరు దాట వాడిపేరు బయటికి పోలేదిన్నాళ్ళూ. కానీ యీనాడు వాడు కథలు మొదలెట్టాడంటే అసలు నాటకం మొదలయిందన్న మాట. ఇది పూర్తికాక ముందే తెర వేసెయ్యాలి" అన్నాను గంభీరంగా.

అంతా ఒక్కసారిగా మాటాడ్డం మొదలెట్టారు.

"కానీ యెలాగ్గురూ...?"

"ఏనాన్స్ చేసిన ప్రైజు వాళ్ళు యివ్వకామానరు, అంగీకరించిన ప్రకారం ఆ పత్రిక వాళ్ళు ఆ కథని అచ్చెయ్యకా మానరు"

"దాంతో వీడు వెర్రెక్కిపోయి, రోజుకి నాలుక్కథలు రాసి, అన్ని పత్రికలకి విరజిమ్మేస్తాడు"

"అనతి కాలంలోనే వీడి పేరు ప్రతిష్ఠలు ధరల్లా ఆకాసంలో చుక్కల పక్క యిళ్ళల్లో కాపురం పెట్టేస్తాయి"

అందరిలో అక్కసు, చెప్పలేని ఆవేదన.

తిరిగ్గా సిగరెట్టు వెలిగించి, తాపీగా పొగ వదుల్తూ నేను పచార్లుచేస్తూ అంతా వింటూనే వున్నాను.

మళ్ళీ గొంతు సవరించుకుంటూ, చిన్నగా దగ్గాను.

నిశ్శబ్దం.

"అందుకే ఆ ఫీల్డులో వాడు ఎదిగిపోకుండా మనం జాగర్తపడాలి. మళ్ళీ నాటకాల్లోకి లాగుదాం" అన్నాను.

"కానీ గురూ! నాటకాల్లో అయినా వాడిదే పైచెయ్యికదా మన గ్రూపులో. అదేం చిత్రమో ఎంత చిన్నవేషం వేసినా జనమంతా వాడ్నే పొగుడ్తారు. ఇక డైరెక్షన్ సరేసరి. వాడికి తప్పితే మనలో యింకో వెధవకి వచ్చిచావదాయె" – తన ధర్మసందేహాన్ని కంగారు మిళితంచేసి వెలిబుచ్చాడు చక్రి.

ఓరకంట వాడికేసి చూసి, అలవోకగా నవ్వాను.

తనూ అనుమానంగా, ప్రశ్నార్థకంగా నావైపు చూస్తున్న సింగు ఆ నవ్వులోని భావాన్ని గ్రహించిన వాడిలా, 'యీజీగా' ఫీలయిపోయి, చక్రివైపు 'నీకేంతెలుసు–మన గురువు తెలివితేటలు, అన్నట్లుగా ఓ వెటకారపు చిరుమందహాసం విసిరాడు.

"ఇప్పుడు మన తక్షణ కర్తవ్యం వాడ్ని కథలు రాయకుండా అడ్డడమే. దానికి అంతకంటే ఎక్కువ పేరు ప్రతిష్ఠలొచ్చే అవకాశం వాడికి చూపిస్తేగాని వాడు మనదారికి రాడు. నాటకాల్లో వాడికి సరైన తోడ్పాటు మన నుంచి లేక నాడు యీ కథల మీదకి మళ్ళాడు కానీ—మళ్ళీ నాటకాలంటే అమాంతం వచ్చేస్తాడు. 'నాటకం ఒటి బ్రహ్మాండమైంది రాయిగురూ, నీ యిష్టంవొచ్చినంత టైం తీసుకుని అందాం' వాడ్ని ఏమాత్రం తొందర పెట్టొద్దు. దాని సాయం ఎప్పటికప్పుడు వాడు రాసిన డైలాగులు చదివి, వాడ్ని వీలయినంతవరకు నిరుత్సాహపరిచి, 'నువ్వుకూడా పెద్ద రచయితల స్థాయికి రాయగలవు గురూ —టైంతీసుకు రాయి' అని ఓ పట్టాన వాడు ఆ నాటక రచన పూర్తిచెయ్యకుండా,

కథల మీదకి మళ్ళకుండా మన శాయశక్తులా తంటాలు పడదాం ఈ విధంగా వాడు కథలూ, గ్రటూ, రాయకుండా చాలానాళ్ళు తప్పించొచ్చు చచ్చీచెడీ వాడు నాటకం పూర్తి చేసి, 'యింకింతకంటే బాగా నేను రాయలే న్నాయనోయ్' అన్నాడు మనం రిహార్సల్సు మొదలెడదాం, ఈసారివాడ్ని డైరక్షన్, ఏక్షన్ జోలికి రాకుండా ప్రొడక్షన్ సైడు చూసుకో మందాం ఎందుకంటే వాడికి రిహార్సల్సు సరిగ్గా జరక్కపోతే అనుమానం రావొచ్చు ఈసారికి దర్శకత్వ బాధ్యత మనలో ఎవరో ఒహరు తీసుకుందాం. రిహార్సల్సుపూర్తయి, పెర్ఫెక్షన్ వస్తేగానీ హాలుబుక్ చెయ్యొద్దని చెబుదాం వాడిరచనకి ఒక సార్ధకతనితీసుకురావడమే మనధ్యేయమని కోతలు కోసేద్దాం పొగడ్తలతో వాడ్నిఅందలం ఎక్కించేద్దాం మొత్తానికి నేనుచెప్పేదేవిటంటే వాడిహ కథలూ, కాకరకాయలూరాసి, పేరు ప్రతిష్టలు తెచ్చుకుని మనగుండెల్లో మంటలు రగల్చకముందేవాడ్ని మళ్లీ నాటకాల మీాదకి మరల్చి అవైనా 'యిదిగో, అదిగో' అంటూ నాన్చి, మనశాయ శక్తులా వాడ్నినిరుత్సాహ పరచి, వాడు మళ్లీ మామూలు'మురారి' గానే వుండేలా చేద్దాం" అని వుపన్యాసం ముగించి, కూర్చున్నాను

అందరి కళ్ళూ ఆనందంతో మెరిసాయి.

'ఓ కే, , 'రైరో', 'అలాగే, 'డన్' అంటూ వుషారుగా పలికారంతా

ప్లాను ప్రకారం మురారిని 'హిల్ టాప్' రెస్టారెంటులో హాజరుపరచి, అంతా నాకోసం ఎదురు చూస్తున్నారు

అందరికీ ఒఖ్ఖసారే చెయ్యూపి 'విష్' చేసి, నాకోసం ఎదురు చూస్తున్న కుర్చీని సంతోషపరిచాను

"కథ రాసావుట గదూ " అన్నాను హీనస్వరంతో. 'ఇంత నీచమైన పని చేసావా' అన్నట్లుగా వుందది

మురారి దెబ్బతిన్నాడు పాపం-అభినందిస్తా ననుకున్నాడు

"అవును గురూ! ఫస్టుప్రైజొచ్చింది దానికి. 'కాంతి' లో త్వరలో పడుతుంది ప్రైజొచ్చిందానికంటే పత్రికలో పడు తున్నందుకు ఆనందంగా వుంది గురూ! పేరు నలుగురికీ తెలుస్తుంది కదా" విధిలేక తనంతట తనే ఆనందంగా చెప్పుకుపోయాడు మురారి.

"ఊఁ ... బానేవుంది! కానీ గురూ, నాటకాల్లాంటి 'జీవకళ' మరేదీ లేదనేవాడివి- మరిచిపోయావా ?" అన్నాను సూటిగా.

"మరచిపోవడవేఁవిటీ, బలేవాడివే! ఎప్పటికయినా నేను అదే మాటంటాను పోతే నాటకాలకి శ్రమయెక్కువ-ఫలితం తక్కువ పైగా యిది పదిమంది సహకారంమీాద ఆధారపడ్డ విషయం కానీ కథ అలాక్కాదు. ఒక్కళ్లం ఏమూల కూర్చున్నా జరిగిపోతుంది. ఖర్చు లేదు డబ్బు, పేరు వస్తుంది అదృష్టం బాగులేక అచ్చవకపోయినా జరిగే నష్టవేఁవీ లేదు"

"అది సరే గురూ! నిజం చెప్పాలంటే నువ్వడిగినప్పుడల్లా నీకు ప్రోత్సాహ సహకారాలు మేమివ్వలేదు. కానైతే నీలోవున్న టాలెంట్ మా ఎవ్వర్లోనూ లేదన్న విషయం ఏనాడో ఒప్పుకున్నాం. ఇప్పుడూ ఒప్పుకుంటు న్నాం. నువ్వు నాటకాలు విరమించుకుని, కథలూ, కాకరకాయలూ మొదలెట్టడం మాలో ఎవ్వరికీ సుతరామ్మూ యిష్టంలేదు ప్రదర్శన యిస్తూండగా ప్రత్యక్షంగా నీకు లభించే 'అప్లాజ్' నాటకాల్లో అంత యింకే కళలో వుంది చెప్పు. ఇదిగోగురూ! నీకు మన ఫ్రెడ్సందరి తరఫునా ప్రామిస్ చేసి చెప్తు న్నాను. నువ్వు - ఏవిటి వింటున్నావా ? బాగా విను, ఆలోచించు - నువ్వొక మాంచి బ్రహ్మాండమైన రెండున్నర, మూడుగంటల 'ఫుల్లెంగ్తుప్లే' ఒకటి రాయి ఆ నాటకాన్ని మేమఁతా యింకో పననేదీ పెట్టుకోకుండా అహోరాత్రాలు శ్రమించి ఒక కళాఖండంగా సృష్టిస్తాం అడుగంటిపోతున్న నాటకరంగా నికి ఆణిముత్యంలాంటి రచన్ని అందించిన ఖ్యాతి నీకు దక్కుతుంది. ఆలోచించుకో. కానైతే ఈ నాటక రచనా కాలంలో నువ్వింక మరి కథలూ కాకరకాయలూ అంటానిక్కూడ రదు మేవందరం నిద్రాహారాలు మానేసి, జీవిత సమస్యగా భావించి, నువ్వు రాయబోయే నాటకాన్ని 'నభూతో న భవిష్యతి' అనిపించు కోగలిగే అపూర్వ కళాఖండంగా నిరూపించ దలుచుకున్నాం. దీనికి అర్జెన్సీ ఏఁవీలేదు. టేక్ యువర్ ఓన్ టైమ్"

చెప్పటం పూర్తిచేసి, ఎండిపోయిన గొంతు కని తడపడానికి మంచినీళ్లందుకుంటూ, మురారి కళ్లల్లోకి చూశాను.

అతని కళ్లల్లో నీళ్లున్నాయి.

అతని అధరాలమీద దరహాసం చిందులాడు తోంది.

"నిజంగా...నిజంగా మీరంతా నా పురోభి వృద్ధికి యింతలా [illegible]స్తున్నారా? ఒక అపూర్వ కళా సృష్టి నా చేతులమీదుగా జరగడానికి ఎలాంటి కష్టాలనైనా ఎదుర్కొన డానికి మీ రంతా సిద్ధంగా వున్నారా? నిజంగా ఎంత అదృష్టవంతుణ్ని గురూ" అన్నాడు నా చేతులు పట్టుకుంటూ

"ఛఛ! యిదేవిఁటి గురూ! నీలాంటి కళా స్రష్ట మా స్నేహితుడని చెప్పుకోవడానికి మేము గర్వపడాలి" అన్నాను, లోపల మండి పోతున్నా పైకి ఆప్యాయతని ఒలకబోస్తూ.



## 25-6-1976 శుక్రవారం మొదలు 1-7-1976 గురువారం వరకు

# వారఫలం

మహేష్

**మేషం :—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం :—** ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. రావలసిన డబ్బు అందుతుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి.

**మిధునం :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**కర్కాటకం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**కన్య :—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి.

---

"సరే గురూ! ఈరోజే నాటక రచన మొదలెడతా! అనతికాలంలోనే......"

"ఆఁ...లేడికి లేచిందే పరుగట. తొందరేం లేదు. ఇన్నాళ్ళూ మనం వేసిన నాటకాలన్నీ ఒక ఎత్తు. ఇప్పుడు నీ సృష్టి ఒక ఎత్తు. ముందు చక్కటి 'ప్లాట్' కోసం ఆలోచించు. మాక్కూడా ఏదైనా తట్టితే చెప్తాం. నువ్వు వ్రాసే ఒక్కొక్క డైలాగు ఒక్కొక్క రసగుళికలా వుండాలి. ఎన్ని నెలలైనా ఆఖరికి ఎన్ని సంవత్సరాలైనా ఫరవాలేదు— తెల్సిందా?" అన్నాను.

సంతోషంగా తలవూపి, మా అందరి దగ్గరా శెలవు తీసుకుని, హుషారుగా బయటకు నడిచాడు మురారి.

అతను పూర్తిగా కనుమరుగయ్యాక విజయ గర్వంతో మా యిడియట్స్ వైపు చూసాను.

వికటాట్టహాసం చేసారంతా.

* * *

పేకాట రోజులాగే జోరుగా సాగుతోంది.

"పాపం! పిచ్చిముండావాడు. తిండికూడా సరిగా తినటంలేదుట. రాత్రిళ్ళు ఒంటిగంట, రెండింటిదాకా మెలకువగా వుంటున్నాట్ట. నిజంగా పాపం పిచ్చాళ్ళా తయారయ్యాడు గురూ" అన్నాడు చక్రి పడిపడి నవ్వుతూ.

"మరేమిటనుకున్నావ్ ? గురూగారు ప్లానేశారంటే తిరుగులేదు. వాడు యిప్పుడు కథల జోలికసలు పోవటంలేదు. కథాకండ సృష్టిలో పడిపోయాడు. ఇతివృత్తం బాగులేదని, పాత్రలు సరిగాలేవని, స్టార్టింగు బావులేదని అడుగడుగునా అడ్డుతూ వచ్చాం. రాసిందే

## జెలసీ

మళ్లీ మళ్లీ మార్చి మార్చి రాస్తూ వాడు యీ రెండ్నెల్లలోనూ మొదటి రంగం మాత్రం పూర్తిచెయ్యగలిగాడు. ఇంక వాణ్ని ముందుకు సాగనివ్వాలి. లేకపోతే ప్లాన్ మొదటికే బెడిసికొట్టి, 'నాటక రచన నావల్ల కాదుగురూ' అని వాడు మళ్లీ కథల మీద పడితే కొంపలు మునిగిపోతాయి" అన్నాడు సింగు సిగరెట్టు పొగని ఆగి, ఆగి రింగులుగా వదుల్తూ.

ఆర్నెల్లు గడచాయి.

మేము ఎన్ని వంకలు పెట్టినా, ఎన్ని విమర్శలు చేసినా, ఓపిగ్గా వింటూ, నిరుత్సాహపడక నాటక రచన పూర్తిచేశాడు మురారి. నిజానికి ఆ నాటకం యితివృత్తంగానీ. అందులోని పాత్రల్నిగానీ మేవరూ సరిగ్గా అర్థం చేసుకోలేదు. వాణ్ని నిరుత్సాహపరచడమే మా పనిగా పెట్టుకొని, విమర్శించుకుంటూ వస్తున్నాం. ముందు స్త్రీ పాత్ర లేకుండా నాటకం రాయమన్నాం. కొన్నిరోజులయ్యాక స్త్రీ పాత్రలేందే నాటకం రక్తి కట్టదన్నాం. ఇంకొన్ని రోజులు పోయాక 'నాటకం కమ్మర్షియల్గా కూడా ఆడ్డానికి పనికొస్తుందీ, రెండు ఆడపాత్రలు పెట్టు' అన్నాం. ఇలా వాడి దుంప తెంపేశాం. కానీ వాడు మొండి పిండం! నిరుత్సాహపడ్డాయె. రోజు కి అయిదారు గంటలైనా కనీసం వాడు స్క్రిప్టుమీద వర్కు చేస్తున్నాడని వాళ్ల తమ్ముడు చెప్పాడు: గెడ్డం గెడ్డం పెంచి నిజంగా మంచి రచయిత 'షేప్' లోకి వచ్చేశాడు. ఇంక రచన్ని విమర్శించడానికి కుదిరేలా లేదు. ఎలాగోలా ప్రదర్శన పేరుతో మరో ఆరునెల్లు నాన్చి, చేతులెత్తేస్తే, మళ్లీ రచన జోలికిరాడు.

"నా శాయశక్తులా అకుంఠిత దీక్షతో యీ రచనని సాగించాను గురూ! మీలాంటి సహృదయులు వెలిబుచ్చిన ప్రతి విమర్శనాయుతమైన సూచననీ అతిజాగర్తగా పరిశీలించి, అవసరమైన మార్పులూ, చేర్పులూ చేశాను. రచన పూర్తిఅయ్యాక కనీసం పాతిక సార్లయినా మొత్తం నాటకం చదివిచూసాను. పరిషత్తు నాటకంగానూ. ప్రొఫెషనల్ నాటకంగానూ కూడా యిది పనికొస్తుందని నేను భావిస్తున్నాను. నామట్టుకు నాకు ఎటువంటి మార్పులూ యిక అవసరంలేదనిపిస్తోంది. మీరు చెప్పినట్టు మీలో ఎవరైనా యీ నాటక దర్శకత్వ బాధ్యత వహించి, జయప్రదంగా నిర్వహించండి. నేను కార్య నిర్వాహకుడిగా మీ ప్రదర్శనకి తోడ్పడి, ప్రేక్షకుడిగా నా స్వకల్పిత రచనా స్వరూపాన్ని కళ్లారాచూసి ఆనందిస్తాను" అన్నాడు ఎంతో ఆనందంతో, ఆ నాటకం వ్రాతప్రతి నా చేతుల్లో పెడ్తూ.

"నువ్వెంత కష్టపడి వ్రాసినప్పుడు మేం మాత్రం ప్రదర్శన విషయంలో శ్రద్ధ తీసుకోమా గురూ! 'ఫుల్ సెటిస్ఫేక్షన్' వచ్చాకే ప్రదర్శిద్దాం. ఓకే!" అన్నాను.

మరో రెండ్నెల్లు గడిచాయి.

మళ్లీ రోజులాగే పేకాట జోరుగా సాగుతోంది.

"వెర్రి ముండా వాడు! రిహార్సల్సు బ్రహ్మాండంగా చేసేస్తున్నా మనుకుంటు

స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు దైవ కార్యాలు నెరవేరతాయి

**తుల** — మీ కార్యక్రమాల్లో వ్యతిరేకత ఏర్పడుతుంది వృత్తిలో చికాకులు ఏర్పడతాయి వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు నూతన విషయాలను తెల్సుకొంటారు

**వృశ్చికం** — మీ ఆలోచనలు ఫలిస్తాయి పోటీ వారిలో గౌరవం బాగుంటుంది వారంమధ్యలో శ్రమకలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి

# వారఫలం

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి అనవసరమైన వ్యయం జరుగుతుంది

**ధనుస్సు** — మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ఫలితం దక్కదు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి

**మకరం** — నూతన వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు అనవసరమైన సందేహాలు కలుగుతాయి ముందుముందు ఉపయోగించగల పరిచయాలు ఏర్పడతాయి

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కుంభం** — స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది బంధుమిత్రులను కల్సుకొంటారు

**మీనం** — వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి జ్ఞాన సాంగత్యం లభిస్తుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ప్రయాణాలు వాయిదా పడతాయి వారం ఆఖరులో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది సంతోషకరమైన సమాచారం అందుతుంది ●

---

న్నాడు ఏదో వంకతో రిహార్సల్స్ దగ్గరకి వాణ్ని రానియ్యకుండా తప్పించేస్తున్నాంకదూ—పాపం, రోజూ టాంక్‌బండ్ మీద రాత్రి చాలాసేపటివరకూ కూర్చుంటున్నాట్ట నాటకం గురించి మధుర స్వప్నాలుకంటూ" అన్నాడు అప్పారావు గారపళ్ళు బయటకు పెట్టి నవ్వుతూ

ఈలోగా యింకో కమ్మర్షియల్ నాటకం ఐడియాలో కూడా వుంచమని చెప్పాను. పాపం — ఆ ఆలోచనల్లో కూడా వుండుంటాడు వారం రోజుల్నుంచి మన దరిదాపులకి రాలేదు" అన్నాను నవ్వుతూనే రిప్లయిస్తూ

'దభేలు'మని తలుపులు తెరుచుకుని, ఒక వ్యక్తి మామధ్య బోర్లాపడ్డాడు

జుట్టు పట్టుకుని ముఖం పైకెత్తి చూశాను

రాధాగాడు

"కొంపమునిగి పోయిందర్రోయ్" అన్నాడు.

ఎనిమిది నెల్లక్రితం సంఘటన గుర్తొచ్చింది ఈసారి ఆటగెలిచే అవకాశం చాలా వున్నా విధిలేక ముక్కలు మూసేశాను

'నీబొంద నీకు ప్రతీదీ కొంపమునిగి నట్టే కనిపిస్తుంది ఏమిటో సరిగ్గా చెప్పేడు" అంటూ కసిరాను

"లేదుగురూజీ! ఇక మనం పెంద్రాళే ఆత్మహత్యలు చేసేసుకోవడం మంచిది మనం తవ్వుకున్న గోతులు మనకోసం సిద్ధంగా వున్నాయి ఈసిగరెట్టు ముక్కలకీ, ఆపేకముక్కలకీ, యీరూముకీ, హేమ్మాలిని

# జెలసీ

కేలండరుకీ 'గుడ్‌బై' చెప్పేసి, కట్టుకట్టుకుని బయల్దేరండి" — ముఖం కందగడ్డలా చేసేసుకుని, గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ రుద్ధస్వరంతో అన్నాడు రాధాగాడు

అందరికీ మతులుపోయాయి

వాడిచుట్టూచేరి, బలవంతంమీద వాణ్ని మంచంమీద కుదేశాం.

వాడు రుమ్మాలుతో కళ్ళు తుడుచుకుంటూ, చీదేశాడు.

"సంగతేమిటో చెప్పిచావరా—దిక్కుమాలిన పీనుగ" అన్నాను.

"మురారిగాడు " ఆగి, అందరివైపూ చూశాడు

అందరూ వాణ్ని మింగేసేలా చూస్తున్నారు సస్పెన్సు భరించలేక చచ్చిపోతున్నారు

"మురారిగాడు మనకోసం రాసిన నాటకాన్ని మనకి యిచ్చే ముందరే ఓ కాపీ 'కాంతి' పత్రిక 'దీపావళి నాటకాల పోటీ'కి పంపించాట్ట, వెయ్యినూట పదహార్లు ఫస్టు ప్రైజు గెలిచేసుక్కూర్చున్నాట్టరా నాయనోయ్"

"ఆ((((((( " అన్నారంతా ఏక కంఠంతో

"వచ్చేనెల్లో ప్రఖ్యాత సినీనటులచేత ఆనాటక ప్రదర్శన 'వరదబాధితుల సహాయనిధి' కోసం రాష్ట్రంలోని పెద్ద పట్టణాలన్నింటిలోనూ జరగబోతోందట"

"ఆ((((((( "అన్నారంతా మళ్ళీ

"ఆ పత్రికవాళ్ళే యీ ఏర్పాటు చేసి, పర్మిషన్‌కోసం వీడికి రాసార్ట అన్నిటికన్న ముఖ్యమైనది, లలితఘోరమైనదీ, నా యీ పాపిష్టి కళ్ళతో కళ్ళారా చూసినదీ " లని, యిక మాటలురాక ఆగాడు రాధాగాడు

అప్పటికే సత్తువంతా కోల్పోయిన మిత్రులంతా వాడికేసి రాక్షసుల్లా చూస్తున్నారు చెప్పినా, చెప్పకపోయినా వాణ్ని చంపేసేలా వున్నారు చెప్పి చచ్చిపోవాలని నిశ్చయించుకున్నాడు వాడు

"ఇందాక మీ దగ్గరకని బయల్దేరాను వాడి యింటి ముందు ఒక పొడుగాటి కారుండడం చూసి, ఏమిటో విశేషం కనుక్కుందామని వెళ్ళాను అక్కడ అయిదు మణుగుల పూలమాలలో మురారిగాడు వాడెదురుగా గ్లాసొక్కపంచె, లాల్చీలో ఖరీదైన మనిషి, యింకా ఒహరిద్దరు ఖములు ఆ దండను మొయ్యలేక మోస్తూ, వాళ్ళని తప్పించుకుని నాదగ్గరకొచ్చాడు వాడు వచ్చి, ప్రైజుసంగతీ, సినిమా కళాకారుల ప్రదర్శన సంగతీ చెప్పాడు చెప్పి, నన్ను చెయ్యి పట్టుకుని ఆ ఖరీదైన మనుషుల దగ్గరకు తీసుకెళ్ళి, "నిజంగా యిటువంటి మిత్రులు నన్ను ప్రోత్సహించి, నా రచనలోని ప్రతి మాటనీ సహృదయంతో విమర్శించి, నాచేత యీ కళాఖండ సృష్టికి తోడ్పడి వుండకపోతే-యీనాడు మీవంటి పెద్దలు నాలాంటి అనామకుడి దగ్గరికి సినిమా కథకోసం వచ్చేవాళ్ళు కాదు" అన్నాడు ఆ తర్వాత మాటలు నాకు వినిపించలేదు ఎప్పుడు బయటకొచ్చానో తెలియదు వాడే నన్ను తరుముకొచ్చి, "ఇప్పుడే మద్రాసు బయల్దేరి వెళ్తున్నాను

(42వ పేజీ చూడండి)

# హైదరాబాద్ నోట్ బుక్

## తెలుగు పునశ్చరణ తరగతులు

అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థ, మైసూరు దక్షిణ క్షేత్రీయ భాషా కేంద్రాల యాజమాన్యంలో మే 11 వ తేదీన ఏర్పాటయినమూడవ తెలుగు పునశ్చరణ తరగతులకు విద్యామంత్రి శ్రీ మండలి కృష్ణారావు ప్రారంభోత్సవం చేశారు. డాక్టర్ ముదిగొండ వీరభద్రశాస్త్రి స్వాగతంచెప్పారు తరగతుల నిర్వాహకులు డాక్టర్ యద్దనపూడి వెంకటరమణారావు నివేదిక సమర్పించారు అంతర్జాతీయ తెలుగుసంస్థ డైరెక్టర్ డాక్టర్ పి ఎస్ ఆర్ అప్పారావు తెలుగు భాషాబోధనకు కలిగించినసౌకర్యాలను వివరించగా, విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ పి ఆదినారాయణ త్రిభాషా సూత్రాన్ని అమలు పరచడంలో వివిధ సంస్థల సహకారం వివరించారు శ్రీ పి రామనరసింహం కృతజ్ఞత తెలిపారు

## శ్రీ వావిలాల సూచన

దేశంలోని ప్రాంతీయ భాషలన్నీ హిందీతో పాటు సమకాలంలోనే అభివృద్ధి పొందితే పరస్పర ద్వేషభావం ఉండదని అధికార భాషా కమిషన్ అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అంతర్జాతీయ తెలుగు సంస్థ, దక్షిణ భారత ప్రాంతీయ భాషా కేంద్రం (మైసూరు) సంయుక్తంగా నిర్వహించిన మూడవ తెలుగు పునశ్చరణ తరగతుల సమాప్త్యుత్సవంలో ప్రసంగిస్తూ చేసిన సూచనను కేంద్ర ప్రభుత్వం గుర్తించాలి నేటి మన సంధానభాష అయిన హిందీ కేవలం ఔత్తరాహుల భాషగా కాక, దేశంలోని వివిధ భాషల పదజాలాన్ని ఇముడ్చుకొన్న జాతీయ భాషగా రూపొందాలని, ఆయన చేసిన సూచనకూడా హిందీ ప్రేమికులు గ్రహించాలి కాంగ్రెస్ కన్నులు తెరిచినప్పటినుంచి హిందీ ప్రచారం జరుగుతున్నది గదా, మరి ఎందుకు నేటికీ అది విస్తరించలేదు ? దానికి కారణమేమిటో శ్రీ వావిలాల సూచనలను పునశ్చరణచేస్తే ఎవరికైనా స్పష్టమవుతుంది

## మోడువారిన 'కల్పలత'

1966 లో పుట్టి ప్రారంభంలో అసంఖ్యాక ప్రజలను ఆకర్షించిన సూపర్‌బజార్ "కల్పలత పదేళ్ళు దాటక ముందే విమర్శకు గురై అవకతవకల దర్యాప్తుకు ఉన్నతాధికార సంఘం నియమించడం జరిగిందంటే, మనం ఆశ్చర్యపడ నక్కరలేదు అత్యవసర పరిస్థితి ఏర్పడి ఇలాటి ప్రజా సంస్థలు బాగుపడే అవకాశం కలిగినందుకు

(43వ పేజీ చూడండి)




# వెలలు తగ్గించేశారు

## రేపటి ఉత్తమ ప్రగతికి పురోగమిద్దాము ప్రెస్టీజ్

**Prestige**

భారత దేశపు బాగా అమ్ముడమే ఎక్కువగా
అభిలంచే ప్రెషర్ కుక్కర్
ప్రెస్టీజ్ అత్యధికమైన పొదుపును భద్రతను ఇస్తుంది
అమ్మకమైన తరువాత విశిష్టమైన
సర్వీసు సౌకర్యము ఉంటుంది
దీనిమీద ISI గుర్తు ఉంటుంది–
ఇదే విశిష్టతకు పూచీ

## ప్రెస్టీజ్ విధానంలో – నేడే ఆదాకి ప్రారంభించండి

Prestige
PREETT

## దేశసంక్షేమానికి తోడ్పడండి !

SAA/TTP/2122 TEL

టిటి. (ప్రైవేట్) లిమిటెడ్ బెంగుళూరు 560 018

శ్రీమతి

# బాంధవ్యాలు

యార్లగడ్డ సరోజినీ దేవి

*(గత సంచిక తరువాయి)*

కౌలు కిచ్చిన భూములను స్వాధీనం చేసుకుని; స్వంతంగా వ్యవసాయం ప్రారంభించాలని శ్రీధర్ ప్రయత్నం. ఆ ప్రయత్నంలో మొదటి భాగంగా గ్రామ కరణం ముందే రైతులతో పరిష్కారం చేసుకోవాలని పిలిపించాడు.

''మీరు ఇంతవరకూ పండించుకున్న పంటకీ ఖర్చుకూ; నాకు రావలసినదాన్ని నేను అడగటంలేదు. క్రమం తప్పకుండా శిస్తులు కడుతున్నారు. అది చాలు! యీ విడతనుంచీ నాకు నా భూములు అప్పగించితే స్వంతంగా వ్యవసాయం చేసుకుంటాను!'' నమ్రతగా అన్నాడు శ్రీధర్.

''ఇంత చదువుకున్న మీరు మట్టిలోనా బాబూ! ఉద్యోగం చెయ్యక?'' కాస్తో కూస్తో చదువుకున్న యువక రైతు అడిగాడు.

''మనం ఎంత చదివినా తినేది మట్టిలో పండిన ధాన్యమేగా? ఉన్న యిల్లు వాకిలి, పొలం పాడుబెట్టుకుని ఎక్కడికో వెళ్లి మరొకరికి చాకిరీ చేసేకంటే వున్నదాన్ని చేయించుకుంటూ నిశ్చింతగా యింటిపట్టున వుండటంలో హాయి ఉద్యోగాల్లోను, బస్తీ కాపురాల్లోనూ లేదు!''

''మీరు చెప్పింది నిజమేనండీ? బస్తీ సరుకులు కల్తీలాగా; ఆ జీవితాలుకూడా అంతా కల్తీ! పల్లెల్లోని హాయి యింకెక్కడా రాదు! మీ భూములు మీకే అప్పగించుతాం. పేచీలేమీ మనకి వద్దు!'' అన్నాడు వయస్సుమళ్లిన రైతు. అందరూ అతని మాటను బలపర్చారు. ఆరోజు గంగాధరంకూడా వుండవలసింది. బోర్డు మీటింగని ఉదయం వెళ్లిపోయారు. సాయంత్రానికిగాని రారు. రైతులు వచ్చారని మాట్లాడుతున్నాడు శ్రీధర్.

''అందరూ కౌలు వదులుకుంటున్నట్లు కాగితాలు వ్రాసి సంతకాలు తీసుకోండి కరణంగారూ!'' అన్నాడు శ్రీధర్.

''అలాగే'' అంటూ కరణంగారు రెవిన్యూ స్టాంపులు, తెల్లకాగితాలకట్టా తీసిపెట్టాడు. కాగితాలన్నీ గంగాధరంగారి ఆదేశానుసారం నిన్ననే పూర్తిచేశాడు. స్టాంపులు అంటించి వాటిమీద సంతకాలు తీసుకోవటమే పని! నాయర్‌ని పిలిచి అందరికీ కాఫీలు పురమాయించాడు శ్రీధర్. పది నిముషాల్లో నాయర్ ట్రేలో కప్పులుంచుకుని అక్కడికి వచ్చి ఒక్కొక్కళ్ళకీ యివ్వసాగాడు. మిలమిల మెరిసిపోతున్న కప్పూ సాసరువంక ఎప్పుడూ చూడనట్లు ఆశ్చర్యంగా చూస్తున్నారు. కంచు గ్లాసులు, యిత్తడి గ్లాసులు తప్పితే లతలు పెయింట్‌చేసి కురసగా; అందంగా వున్న కప్పలను వాళ్లింతవరకూ లేదు. అందుకే వృద్ధ రైతులు ఆశ్చర్యంగా చూస్తున్నారు. కొంచెం చదువుకున్న యువరైతులు పట్నం వెళ్లినప్పుడు కాఫీహోటల్‌కి వెళ్లినా అక్కడ కప్పూ సాసర్లు యింత అందంగా శుభ్రంగావున్న వాటిని చూడలేదు. తెల్లని సాసరు ఎక్కడ మురికి అయిపోతుందేమోనని పైకండువాతో పట్టుకుని త్రాగుతున్నారు కొందరు. తాగిన తరువాత చేతుల్లోనే వుంచుకున్నారు. నాయర్‌కి నవ్వువచ్చింది. అందరిదగ్గిరా ఖాళీ కప్పులను తీసుకుని ట్రేలో పెట్టుకుని లోపలికి వెళ్లిపోయాడు. కరణం సంతకాలు వచ్చినవారి దగ్గిర సంతకాలు; వేలిముద్రలు వేసేవారిచేత వేలిముద్రలు వేయించి సాక్షిగా తానూ సంతకాలు చేసి కాగితాలన్నీ శ్రీధర్ కిచ్చాడు. మరోసారి వాటిని చూసుకుని చాపమీద నుంచి లేచాడు. రైతులుకూడా లేచారు.

''మీరు వుండండి!'' అని లోపలికి వెళ్లి మరో పది నిముషాల్లో తిరిగివచ్చాడు చేత నోట్ల కట్టతో; డబ్బు ఎందుకో అర్థంకాలేదు కరణానికి.

''నేనిలా వస్తానని; వచ్చి స్వంత వ్యవసాయం చేస్తానని మీరెవ్వరూ ఊహించలేదు. పట్నవాసపు జీవితంమీద నాకేమాత్రం వ్యామోహం లేకపోవటం వల్లనే యీ నిర్ణయానికి వచ్చాను. అందుకు నష్టపరిహారంగా మీ అందరికీ తలో అయిదు వందలు చొప్పున యిస్తున్నాను!''

అంటూ పేరు పేరునా అందరికీ అయిదేసి వందలు లెక్కపెట్టి యిచ్చాడు శ్రీధర్. అనుకోని యీ పరిణామానికి రైతులు ఆశ్చర్యపోయినా అంతకంటే ఎక్కువగా ఆనందపడ్డారు. ఇన్నేళ్ల నుంచీ పంట లెక్క అడక్కపోగా ఎదురు యింకా డబ్బు యిస్తున్న శ్రీధర్ కనకదుర్గమ్మ కొడుకుగా కనిపించలేదు. మహోన్నతమయిన మనిషిగా వాళ్ల కళ్లకు కనిపించాడు. కరణంగారికికూడా అయిదు వందలు యిచ్చి చేతులు పట్టుకున్నాడు కృతజ్ఞతగా.

''నీ మంచి మనసే నీకు శ్రీరామరక్ష అవుతుంది బాబూ! సంస్కారం పుట్టుకతోనే వస్తుందంటారు యిదే కాబోలు!'' సంతోషంగా అన్నాడు కరణం.

''మీ ఆశీర్వాదం సార్!'' అంటూ మిగిలిన డబ్బు బీరువాలో వుంచేందుకు లోపలికి వెళ్లాడు శ్రీధర్.

''చాలా యోగ్యుడు కాబట్టే తల్లి వుండగా కాని సంబంధం తల్లి పోయిన తరువాత చేసుకున్నాడు. మహాతల్లి ఏ లోకంలో వున్నదోగాని డబ్బు కోసం నానా గడ్డీ కరిచేది. ఆ తల్లికి ఈ కొడుకా అంటే ఆశ్చర్యం వేస్తోంది!'' రైతు అన్నాడు.

''మేనమామ దయాగుణం మేనల్లుడికి వచ్చింది. అందుకే అన్నారు. మేనమామ గుణాలు! మేనత్త పోలికలూ వస్తాయని!'' అన్నాడు కరణం.

**జరిగిన కథ:** తనను కోడలుగా చేసుకోవటానికి అంగీకరించని మేనత్త చనిపోయింతర్వాత తండ్రి కెదురు చెప్పలేక బావ శ్రీధర్‌తో తాళి కట్టించుకున్న విజయ మనసు సరిపెట్టుకోలేకపోతుంది. శేఖర్ జానకిలు విజయ అన్నా వదినలు.

''ఇద్దరూ బాగా చదువుకున్నవాళ్లేగా? ఈ పల్లెల్లోవాళ్లేమి చేస్తారంట?'' బస్తీ అంటే స్వర్గం అనుకునే మరో రైతు యువకుడు అన్నాడు.

''బస్తీ బాగోలేదన్నాడుగా? అదీగాక విజయమ్మని విడిచి గంగాధరం బాబుగారు వుండ లేరు అని బస్తీ కాపురం మానుకుని వుంటారు? అయినా పెద్దింటి విషయాలు అంత తొందరగా పొక్కవు!'' రహస్యం చెప్తున్నట్టు అన్నాడు.

''అదీ నిజమే కరణంగారు? పెళ్లి మాత్రం చాలా బాగా చేశారు? ఎన్ని రకాల వంటలు? ఎంత మంది జనం?... మనలాంటివాళ్ళ యిళ్లల్లోని పాతికమంది ఆడపిల్లలకి కట్నాలు యిచ్చి పెళ్లి చేసి పంపేవాళ్లం ఆరి ఖర్చులుకయిన వాటితో?''

''నాలుగు తరాలనుంచి వస్తున్న పెద్దింటి కుటుంబమాయె? ఆపాటి చెయ్యలేదా? మనకీ అంత సిరిసంపదలు వుంటే చేసుకోమేమిటి?...''

వాళ్లు ఎంత నెమ్మదిగా మాట్లాడుకుంటున్నా లోపలున్న శ్రీధర్‌కి వినిపించుతునే వున్నవి. తాను లోపల వున్నంతసేపూ వాళ్లలా మాట్లాడుకుంటూనే వుంటారని బీరువా తాళాలు డ్రాయర్‌మీద వుంచి బైటకి వచ్చాడు. శ్రీధర్ రావటం ఆలస్యం అన్నట్టుగా సెలవు తీసుకుని కరణంతోసహా అందరూ వెళ్లిపోయారు. శ్రీధర్ మంచితనం గురించి గొప్పగాను; అతని తల్లి రాక్షసతనం — పీనాసితనం గురించి అసహ్యంగానూ చెప్పుకోసాగారు కరణం చెప్పగానే!

''స్నానానికి నీళ్లు తోడానుబాబూ!'' రంగన్న టవలు యిచ్చి వెళ్లాడు. వాళ్లన్న మాటలను మననం చేసుకుంటూ యాంత్రికంగా బాత్‌రూంలోకి వెళ్లాడు. తను రాగానే తాటాకుల దడి తీయించేసి విశాలంగా అన్ని వసతులతో బాత్‌రూం కట్టించాడు వర్షం వచ్చినా తడవకుండా లోపలికి వచ్చేటంత బారూ ఆస్ బెస్టాస్ వేయించాడు. విజయ ఈ యింటికి వచ్చాక కొత్త మార్పులతో పెంకుటింటిని పడగొట్టి అందమయిన మేడ ఆధునిక సౌకర్యాలతో కట్టించాలనుకుంటుండగా శేఖర్ చెప్పిన మాట గుర్తుకు వచ్చి తనలో తనే పులకించిపోయాడు. అప్రయత్నంగా వంటిమీద పోసుకోబోయిన నీళ్లను తలమీద దిమ్మరించుకున్నాడు.

శ్రీధర్ ఫారిన్ నుంచి వస్తూ విజయకని తెచ్చిన ఆటోమేటిక్ 'డే' డేటు గల రిష్టువాచీ డైమండ్ రింగూ తీసి జేబులో వేసుకుంటూనే లాకర్ మీదకు దృష్టి పోయింది. అందులో ఏమేమి వున్నవోనని తెరిచి చూశాడు. లాకర్‌నిండా చంద్రహారాలు; నానుపట్టెడ, వడ్డాణం, కాసులపేర్లు లాంటి తల్లి పూర్వపు వస్తువులతోపాటు పసుపుతాడుకి కట్టి వున్న సూత్రాన్ని చూసేసరికి అదిరిపడ్డాడు. మరిచిపోయిన వెన్నో గుర్తుకువచ్చాయి. ఈ పసుపుతాడే నాకూ విజయకు మధ్య అగ్ని రేపింది. జీవితాలను అంధకారబంధురం చేసింది. తల్లి మూర్ఖత్వం; డబ్బుమీద విపరీతమయిన ఆశవల్ల అయిన మేనరికాన్ని వదులుకుని రెండు లక్షలు కట్నానికి ఆశపడి తన మెడలువంచి వివాహం నిశ్చయించింది. మొట్టమొదటినుంచీ తల్లి అంటే వున్న భయంవల్ల

ఎటూ చెప్పలేక ధైర్యంచేసి చెప్పినా తననొక పసివాడుగా భావించి నోరు మూయించింది. అయిన వాళ్లతోనే కాకుండా మేనమామతోకూడా విరోధం తెచ్చుకోవలసివచ్చింది. లోపల ఎంత బాధ వున్నా పైకి నవ్వుతూ పలుకరించేవాడు గంగాధరం. తన బాధను, అసమర్థతను విజయ మనసులో తుఫాన్ రేపింది. ఇద్దరిమధ్యా అంతులేని అగాధాన్ని సృష్టించింది. తానా పెళ్లి చేసుకోలేదు. తల్లి అత్యాశకు పండు జీవితం అంకితమయిపోయింది. మరో ప్రేమ హృదయంలో అసహనం ఏర్పడింది. ఇప్పుడు విజయ తననెలా ఆదరించుతుందో ?

బాధగా లాకరు మూసి బీరువా తాళంవేసి డ్రాయర్‌లో పెట్టాడు. ఉత్సాహంగా వాచీని ఉంగరాన్ని జేబులో వేసుకున్నాడు. అంత నిరుత్సాహంగా వచ్చి కుర్చీలో కూర్చుని కణతలు రుద్దుకోసాగాడు. దేనినయితే మర్చిపోవాలని ఫారిన్ వెళ్లిపోయాడో ? అదే గుర్తుకువచ్చి శ్రీధర్ మనసుని వికలంచేసింది. రోజూ ఎనిమిదిగంటలకే భోజనానికి గంగాధరంగారింటికి వెళ్లే శ్రీధర్ ఆపూట తొమ్మిది అయినా భోజనానికి వెళ్లకుండా కూర్చునివుండటంతో నాయర్, రంగన్న కూడా భోంచెయ్యకుండా కూర్చున్నారు. శ్రీధర్ కణతలు రుద్దుకోవటం చూసిన నాయర్ —

"కాఫీ తీసుకురమ్మంటారా సార్ ?" అనడిగాడు.

"అరకప్పు టీ తీసుకురా ?" కళ్లు మూసుకుని కణతలు రుద్దుకుంటూ అన్నాడు.

రోజులాగా ఉత్సాహంగా లేకపోవటం రంగన్న ఆలోచించటానికి అవకాశం కలిగించింది. టీ కలుపుకొచ్చి డ్రాయర్‌మీద పెట్టి కొంచెం దూరంలో నిలబడ్డాడు కప్పు తీసుకువెళ్లేందుకు. ఇంతలో శేఖర్ వచ్చాడు నవ్వుకుంటూ.

"పిలిస్తేగాని రాకూడదనుకున్నావా బావా ? అల్లుడు బెట్టు పోనిచ్చుకున్నావుకాదు సమయానికి!" అంటూ మరో కుర్చీలో కూర్చున్నాడు.

"అదేం కాదుగాని రైతులతో కౌలు విషయం పరిష్కారం చేసుకుని స్నానంచేసి యిప్పుడే వచ్చి కూర్చున్నాను. నువ్వూ వచ్చావు. నాకలాంటి ఉద్దేశ్యంలేదు శేఖర్ ! నా ఆలస్యం నిన్ను రప్పించినందుకు క్షమించు !" నొచ్చుకుంటూ అన్నాడు.

నాయర్ మరో కప్పు టీ తీసుకొచ్చి శేఖర్‌కి యిచ్చి కాళీ అయిన కప్పు తీసుకుని లోపలకి వెళ్లిపోయాడు.

"వేళాపాళా లేకుండా యిలా టీ త్రాగానని మీ అక్కకి తెలిస్తే నేను నాలుగురోజులు పస్తుండాల్సిందే!" కప్పు తీసుకుంటూ అన్నాడు.

"అక్కడికీ నువ్వేదో భయపడి బ్రతుకుతున్నట్లు !"

"మరేమిటనుకున్నావు ? అందుకే అయిన సంబంధాలు చేసుకోవాలంటాము. ఒకరి మనసులు మరొకరు వివాహానికి ముందే అర్థం చేసుకుని వుంటారు కాబట్టి అన్యోన్యంగా వుండగలరని నా అంచనా ? జానకి చూస్తుండగా ఎక్కువగా సిగరేట్లు కాల్చకూడదు. కాఫీ టీలు లెక్కప్రకారం త్రాగాలి !"

"ఆ మాటకొస్తే జానకిదే రైటు! సిగరెట్లు కాఫీలు ఆరోగ్యానికి మంచివి కావని డాక్టర్ల పరిశోధనలవల్ల తేలినది. నేను ఆమె అభిప్రాయాలను గౌరవించుతాను శేఖర్ ?"

"అయితే నేను వంటరివాడి నన్నమాట ?" అంటూ జేబులోనుంచి సిగరెట్టుపెట్టె లైటరూ తీసి తనొకటి తీసుకుని పెట్టె శ్రీధర్ ముందుకు జాపాడు తీసుకోమన్నట్లుగా. పెట్టెను అందుకుని మూసి డ్రాయర్‌మీద వుంచి నవ్వుతూ అన్నాడు.

"అలవాటు లేదు !"

"వ్వాట్ ? ? ఫారిన్ వెళ్లినానా ? ?..."

"మారనివాళ్లు విదేశాలే కాదు; అంతరిక్షానికి వెళ్లినా మారరు !"

ఈసారి ఆశ్చర్యపోవటం శేఖర్ వంతు అయింది. కాలేజీ హాస్టల్లో శేఖర్ వున్నప్పుడు రూంమేట్సుతో పాటు సిగరెట్లు; పేకాట; కంపెనీ కోసం ఆదివారాలప్పుడు త్రాగటం అలవాటయింది. బి. ఏ. తో చదువు ఆగిపోయి యింటికి వచ్చి వివాహం చేసుకుని స్థిరపడిన తరువాత పేకాట త్రాగుడు లేకపోయేసరికి గంగిరెద్దులా తిరుగుతున్నట్లుండేది. తండ్రి అంటే వున్న భయంతో వాటిని మానుకున్నా సిగరెట్లుని మాత్రం మానలేదు. తండ్రి చూడకుండా కాల్చటం అలవాటయింది. సిగరెట్ నుసి క్రింద రాల్చుతూ అప్రయత్నంగా శేఖర్ దృష్టి శ్రీధర్‌మీదికి మరలింది.

అతను ధరించిన షర్టు క్రీం కలర్ టెరికాట్‌ది కావటంవల్ల నల్ల బెల్టుగల వాచీ స్ట్రాప్ స్పష్టంగా కనిపించుతోంది. మరో వస్తువు వున్నట్లున్నదిగాని స్పష్టంగా కనిపించలేదు. జానక్కికూడా నల్ల స్ట్రాప్ వున్న వాచీ వున్నది అనుకున్నాడు. శ్రీధర్ మాట తీరు; పద్ధతి ఫారిన్‌లో వున్నా మారలేదు. చాలా మామూలు మనిషిగానే ఫారిన్ నుంచి తిరిగి వచ్చిన శ్రీధర్ మనోనిగ్రహానికి మనసులోనే అభినందించుకున్నాడు. శ్రీధర్ వాచీ వంక చూశాడు తొమ్మిదిన్నర అయింది. వెళ్దామా అనుకున్నాడు. శేఖర్ అనందే తానెలాగా అని ఆలోచించాడు. కాని మనసు తొందరగా వెళ్లి విజయ సమక్షంలో పడిపోవాలని ఆరాటపడుతోంది. ప్రతీ అయిదు నిముషాలకి వాచీ చూసుకుంటున్న శ్రీధర్ భావాన్ని గ్రహించిన శేఖర్ లేచి అన్నాడు.

"ఇక వెళ్దామా బావా ?..."

"అలాగే!" శ్రీధర్ లేస్తూనే రంగన్నను పిలిచాడు.

వారితోపాటు వీధి గుమ్మం వరకూ వచ్చాడు.

"తలుపులు వేసుకోమంటారా బాబూ !"

రోజులాగానే ఆ వేళకూడా అడిగాడు రంగన్న. వీధి గుమ్మాలు దిగుతున్న శ్రీధర్ ఆ మాటతో ఆగి ఓ క్షణం ఆలోచించి అన్నాడు.

"తలుపులన్నీ జాగ్రత్తగా వేసుకోండి..."



అంటూ రోడ్డుమీదికి వచ్చాడు ఆ మాటతో రంగన్న ముఖం వెలిగిపోయింది. మరో నెలకంతా చిన్నమ్మ గారు ఈ యింటికి వచ్చేస్తారు! అన్న సంబరంతో ఈ వార్త నాయర్‌కి చెప్పాలని తలుపులు వేసుకునివెళ్లాడు.

## 3

"ఇంత ఆలస్యం అయిందేమిటి ?"

ఇద్దరివంకా చూస్తూ అడిగాడు గంగాధరం.

"మాట్లాడుతూ కూర్చున్నాం." అంటూనే డైనింగ్ టేబిల్ ముందు కుర్చీ లాక్కుని కూర్చున్నాడు శేఖర్. శ్రీధర్ నవ్వుతూనే కూర్చున్నాడు. ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్లిన శేఖర్ గంటకి తిరిగిరావటంతో గంగాధరం నవ్వుకున్నాడు.

"మీరు వచ్చి ఎంతసేపయింది మామయ్యా?" అనడిగాడు శ్రీధర్.

"బోర్డు మీటింగంటే ఎవరికీ శ్రద్ధలేకుండా వుంది. ఒక్కొక్కళ్లే రావటంతో పుణ్యకాలంకాస్తా దాటిపోవటం రివాజు. అన్నీ తెముల్చుకుని వచ్చేసరికి యీవేళ అయింది. ఆఁ! ఇంతకీ కరణం రాత కోతలన్నీ సిద్ధం చేశాడా? కౌలుదారులు ఏమన్నారు ?" అనడిగాడు గంగాధరం.

## బాంధవ్యాలు

"అన్నీ పూర్తయ్యాయి. రైతులు చాలా సంతోషంతో అంగీకరించారు,"

శాంతమ్మ తనే స్వయంగా అందరికీ కొసరి కొసరి వడ్డించుతోంది. చాలా సంవత్సరాల తరువాత మేనల్లుడికి తన చేత్తో వడ్డించుతోంది యిప్పుడేను. రోజుకంటే ఆపూట మరో రెండు రకాల స్వీట్సు అదనంగా చేశారు. కబుర్లు చెప్పుకుంటూ ముగ్గురూ భోజనాలు చేస్తున్నారు. గతం ఏమాత్రం మాటల్లో దొర్లకుండా గంగాధరం జాగ్రత్తపడుతున్నాడు. విజయ వివాహం శ్రీధర్‌తో నిశ్చయించినప్పుడే ఇంట్లో అందరికీ పేరు పేరునా చెప్పాడు. గతం ఎవరూ ఏ విషయంలోనూ మాట వరసకయినా తేవద్దని; అలా తెచ్చి శ్రీధర్ మనసు నొప్పించినవాళ్లెవరయినా వుంటే కఠిన శిక్షకి పాత్రులవుతారని హెచ్చరించాడు. అప్పటినుంచీ ఎవరిమట్టుకు వాళ్లు కొత్త మనుష్యులం; అన్నట్టుగా మెలుగుతున్నారు.

రోజూలాగా విజయకోసం శ్రీధర్ కళ్లు అన్వేషించటంలేదు. ఎలాగూ కలుసుకుంటాం అన్నంత నిబ్బరంతో తలవంచుకుని భోంచేస్తున్నాడు. పక్కగదిలో నుంచి దగ్గు వినపడటంతో విజయదేనని చప్పున తలయెత్తి చూశాడు కనిపించుతుందేమోనని. కాని కనిపించలేదు. గది తలుపులు దగ్గరకు చేర్లవేసి వున్నాయి. విజయ ఏం చేస్తూ వుంటుందిప్పుడు ? తనను గురించి ఆలోచించు కుంటూ వుంటుందేమో ? అనుకోకుండా వుండలేకపోయాడు. భోజనం ముగించి చేతులు కడుక్కోగానే వక్కపొడిడబ్బా మూత తీసి టేబిల్ మీద పెట్టింది. శ్రీధర్ రెండు పలుకులు తీసి నోట్లో వేసుకున్నాడు, అదే ఎక్కువ అన్నట్టుగా.

"చాలా పొద్దుపోయింది. పడుకుందువుగాని రా బావా !"

అంటూ శేఖర్ ముందు నడువగా శ్రీధర్ అతన్ని అనుసరించి మేడమీదకు వెళ్లాడు యాంత్రికంగా; శేఖర్ బైటనే నిలబడ్డాడు.

"ఆ గది నీదే బావా !"

అంటూ జవాబుకయినా ఎదురుచూడకుండా క్రిందికి వెళ్లిపోయాడు శేఖర్.

ఓ క్షణం గుమ్మంలోనే నిలబడిపోయాడు శ్రీధర్. విశాలమయిన బాల్కనీ; పిట్టగోడకి పొరాడుతున్న కొబ్బరిచెట్ల ఆకులు. ఏ కొంచెం గాలివేసినా కొబ్బరి ఆకుల కదలిక గదిలోకి వినిపించుతుంది. గది నలువైపులా కలియచూశాడు. డబుల్‌కాట్ మంచాలమీద తెల్లని కొత్త దుప్పట్లు పరిచివున్నవి. డ్రాయర్‌మీద ట్రాన్సిస్టర్ పేపర్లు, వార పత్రికలు వున్నవి. సగం తెరిచి పెట్టి బోర్లించి వున్నది పుస్తకం. తీసి చూశాడు. యం. ఏ. లిటరేచర్ రిఫరెన్సు. గది మధ్యలో సోఫా సెట్ వుంది. మరొక గదిలోకి వెళ్లాడు. అలమర నిండా పుస్తకాలు అందంగా పేర్చివున్నాయి. అక్కడే కూర్చుని చదువుకునేందుకు అనువుగా కుర్చీలు డ్రాయర్ వున్నాయి. మరోప్రక్కగా బీరువా; బట్టల స్టాండు, స్టాండుకి దగ్గిరగా రెండు సూటు కేసులు వున్నాయి. తాళం వెయ్యకపోవటంవల్ల చీరలు కాళీలోనుంచి కనిపించుతున్నవి. స్టాండుస హేంగర్సుకి పది చీరలు మ్యాచింగ్ బ్లౌజులతో తగిలించివున్నవి. బహుశా ఈ రెండు గదులు విజయవి అయివుంటాయి. అందుకే నీటుగా సర్ది వున్నవి ఎక్కడివి అక్కడే! అలమరలో వున్న నవల తీసుకుని ముందు గదిలోకి వచ్చి కుర్చీలో కూర్చు న్నాడు. పేజీలు తిరగవేస్తూనే వున్నాడుగాని మనసు దానిమీద లగ్నం కావటంలేదు. ఏకాస్త చప్పుడు వినిపించినా విజయ వస్తున్నదన్న భ్రమ పదే పదే వాకిటవైపుకి చూసేలా చేస్తోంది. ఆ చప్పుడు గాలికి కొబ్బరి ఆకులు పిట్టగోడకి రాసుకుంటే వచ్చేవి. డ్రాయర్‌మీద అలారం టిక్కు టిక్కు మంటూ తన పని తాను చేసుకుపోతోంది. పదిన్నర అయింది. అబ్బా అనుకున్నాడు.

ప్రతీ నిముషం శ్రీధర్ కొక యుగంలాగా వుంది. విసుగ్గా పుస్తకాన్ని మూసి డ్రాయర్‌మీద పెట్టి పేపర్ తీసుకున్నాడు. రాజకీయ వార్తలు చదవసాగాడు.

ఆడవాళ్లు ముగ్గురూ భోజనాలు చేస్తున్నారు. వంటమనిషి వడ్డించుతున్నాడు. వడ్డించుతుంటే అవసరంలేదని చెయ్యి అడ్డు పెట్టటం మినహా నోరు విప్పి ఒక్క మాటా మాట్లాడటంలేదు విజయ. శాంతమ్మ కూతురు ముభావాన్ని "సిగ్గు"గా భావించుకుంది. జానకి మాత్రం లోలోపలే ఆందోళన పడుతున్నా పైకి నవ్వుతు గంభీరంగా వుంటోంది. విజయ ఒక్కొక్క మెతుకూ ఏరుకుని తింటున్నది. కావాలని చేస్తున్న ఆలస్యంలాగా వుంది జానక్కి. పగలంతా అటూ యిటూ క్షణం విశ్రాంతి లేకుండా గడపటంవల్ల జానక్కి ఆవులింతలు వచ్చేస్తున్నవి. విజయ విషయం శాంతమ్మ కోడలికే అప్పగించింది వివాహం ముందు రోజు నుంచీను. యిప్పుడూ అంతే! యివ్వాళకూడా కాసేపు శ్రమపడితే యింక తన బాధ్యత లేకుండానే మిగతా రోజులు కూడా గడిచిపోతాయని జానకి అభిప్రాయం. అందుకే విజయ ప్రతీ చర్యనూ గమనించుతోంది. వట్టి పళ్లెం ముందు కూర్చున్న విజయను చూసి.

"ఎందుకిలా కూర్చోవటం ? చాలా పొద్దుపోయింది. యింక పడుకోవచ్చునుగా !" అంది.

"అలాగే వదినా ?..."

తల్లి వుండటంవల్ల యింకేమీ అనలేక లేచి మేడమీదకి వెళ్లకుండా జానకి గదిలోకి వెళ్లింది. వెనుకనే వచ్చిన జానకి తలుపులు దగ్గిరకు చేర్లవేసి బొడ్లో వున్న తాళాలగుత్తిని తీసి బీరువా తెరిచి తెల్లని చీర జాకెట్టు తీసి విజయ చేతుల్లో వుంచి కట్టుకోమన్నది. ఫ్రిజ్‌లో నుంచి మల్లెలు కనకాంబరాలు తీసుకొచ్చి విజయ జడలో పెట్టింది. వద్దన కుండా పెట్టించుకున్నందుకు సంతోషించింది. చీర కట్టుకోమని మరోసారి చెప్పింది.

"ఏమిటి వదినా ! అనవసర ఆర్భాటాలు చేస్తున్నావు ? యివన్నీ వుంటేనేనా ? అయినా నేను కట్టుకున్నదీ తెల్లచీరేగా ?" అంటూ నవ్వింది.

"ఎంత చదివినా మన ఆచారాలు మనకి వున్నాయిగా విజయా ! కొత్తచీరె కట్టుకోవటం

---

న్యూయార్కులోని తెలుగు సారస్వత సాంస్కృతిక సంఘంవారు ఉగాది వేడుకలని ఉత్సాహంతో జరుపుకున్నారు. శ్రీమతి కౌతా సీమంతిని ప్రార్థనతో ప్రారంభమై శ్రీ ఘండికోట వేంకట సుబ్బారావు పంచాంగశ్రవణం, వెంపటి సిస్టర్స్ ఉష, అనూరాధల నృత్యం, శ్రీ సత్తిరాజు సూర్యప్రసాద్ ఏకపాత్రాభినయం, శ్రీ యం. బి. కె. మూర్తి పాటలు, శ్రీ శ్రీరంగం శ్రీధరాచార్య నాటిక 'ప్రతిధ్వనులు' ప్రదర్శన, తెలుగు గ్రంథాలయా విష్కరణ, వ్యాసరచన పోటీలో విజేతలైన చిరంజీవులకి బహుమతి ప్రదానం ఆనాటి కార్యక్రమంలో చోటుచేసుకున్నాయి.



'ప్రతిధ్వనులు' నాటిక ప్రదర్శన సందర్భంలో శ్రీయుతులు సూర్యప్రసాద్, డా. రవీంద్రనాథ్, తిపిర్నేని తిరుమలరావు, మంగిపూడి కొండలరావు; (నిల్చున్నవారు) శ్రీ దామా సుబ్బారావు, డా. వంగూరి కృష్ణశాస్త్రిగార్లని చిత్రంలో చూడవచ్చు. ఆనాటి సభా కార్యక్రమాలని శ్రీమతి కొచ్చెర్లకోట నిర్మల నిర్వహించారు. ( ఒ. వి. )

సత్యచిత్ర, మాధవి ప్రొడక్షన్స్, ప్రసాద ఆర్ట్ పిక్చర్స్, సురేష్ మూవీస్, కౌముదీ పిక్చర్స్ వంటి మంచి సంస్థల్లో తనకు స్థానం లభించి నందుకు, జయసుధ వుప్పొంగిపోతూంది.

### వచ్చే వుత్తరాలు !

జయసుధకు రోజూ వంద వుత్తరాలు వస్తాయి. వచ్చే ప్రతి వుత్తరాన్ని చదివే మంచి అలవాటు జయసుధకు వుంది. అందరికీ సమాధానం యిస్తూ, ఫోటో పంపించే సంస్కారం కూడా వుంది.

ఆమెకు వుత్తరాలు రాసేది ఎవరో తెలుసా ? విద్యాధికులు, విద్యార్థులు, మహిళలు, చిన్నపిల్లలు. వచ్చే వుత్తరాల్లో సభ్యత, సంస్కారం వున్నాయి, అంటుంది జయసుధ.

### జన ప్రవాహం !

బజుల్లా రోడ్డులో ఒక మహానటుడు స్థిరపడి రెండున్నర దశాబ్దాలు దాటింది. ఆ యింటి వాకిట రోజూ వేలాది ప్రేక్షకులు యిప్పటికీ వస్తున్నా రంటే, ప్రజల్లో ఆ నటుడు ఎంత పాపులర్‌గా వున్నాడో అర్థమవుతుంది.

మే యిరవై ఎనిమిదిన, ఆయన పుట్టారు. ఆ రోజున ఆశీర్వదించినవాళ్ళు, అభినందించిన వాళ్ళు, ఆత్మీయతను ప్రదర్శించినవాళ్ళు వేల సంఖ్యలో వున్నారు.

ఉదయం ఆరు గంటలకు యీ విలేఖరి ఆ మహానటుడికి శుభాకాంక్షలు తెలపడానికి వెళ్ళాడు.

### విచిత్రమైన వర్‌షిప్ !

అదేమిటోగాని, ఆరు గంటల నుంచి ఎనిమి దింటివరకు ప్రేక్షకులు వస్తూనేవున్నారు. వారంద రినీ ఆప్యాయంగా పలకరించారు, ప్రజానటుడు.

ఆయన్ను ప్రజలు ఎంతగా వర్‌షిప్ చేస్తు న్నారో, యీ రచయిత కళ్ళారా చూశాడు.

### చక్రవర్తి చిత్ర ప్రారంభం

రాయలసీమలో వెలసిన మరొక పంపిణీ సంస్థ చక్రవర్తి చిత్ర. ఎన్టీఆర్ ఆశీర్వాదబలంతో, మే యిరవై తొమ్మిదిన తిరుపతి నెహ్రూ వీధిలో చక్రవర్తి చిత్రవారి ఆఫీసు ఆరంభమైంది.



'సిరిసిరి మువ్వ'లో జయప్రద

"నటరత్న" పూజ సలిపి, చక్రవర్తి చిత్రకు జయము చేకూరాలని దీవించారు. ఆ దేవుణ్ని ప్రార్థించారు. ఆయనతోబాటు నిర్మాత పుండరీకాక్షయ్య, బలరామ్‌గార్లు చక్రవర్తి చిత్రకు మేలు కలగాలని ఆశించారు.

చక్రవర్తి చిత్రకు చిత్తూరు చక్రవర్తి అధినేత. ఈయనకు బస్సు రూట్లు వుండేవి. ఇప్పుడు బస్సుల జాతీయకరణ జరగడంతో, మరో వ్యాపారాన్ని తలపెట్టారు, చక్రవర్తి.

తన స్నేహితుడు, ఆత్మీయుడు అయిన ఆనంద్ సలహానుసరించి పంపిణీ సంస్థను ప్రారంభించారు.

ఈ సంస్థ "సెక్రటరీ" చిత్రాన్ని విడుదల చేసింది. మొదటి చిత్రం ఆశాజనకంగానే వున్నట్టు చక్రవర్తిగారు చెప్పారు.

### ఎన్టీఆర్ గారి చిత్రాలు

రామకృష్ణ సినీ స్టుడియోస్ నిర్మిస్తున్న రెండు చిత్రాలను పంపిణీ చేసే బాధ్యతను చక్రవర్తి చిత్ర స్వీకరించింది. "దాన... వీర... శూర... కర్ణ మరియు చాణక్య... చంద్రగుప్త"

ఇంతవరకు ఎవ్వరూ యివ్వనంత ఫ్యాన్సీ ప్రైస్ నిచ్చినట్టు తెలుస్తూంది.



'శీలానికి శిక్ష'లో శారద

### దాన...వీర...శూర...కర్ణ

రామకృష్ణ సినీ స్టుడియోస్ జూన్ ఏడున ప్రారంభించిన "దాన...వీర...శూర...కర్ణ" వర్ణ చిత్రం రాబోయే సంక్రాంతి శుభదినాన విడుదల చెయ్యడానికి నిర్ణయించినట్టు రామారావు చెప్పారు.

మహాభారత గాథలోని అన్ని ఘట్టాలు "దాన...వీర...శూర...కర్ణ" చిత్రంలో ఉంటాయి అనేది నిజాన్ని నటరత్న వెల్లడించారు.

కృష్ణుడుగా, సుయోధనుడుగా, కర్ణుడుగా రామారావు నటిస్తున్న "దాన...వీర...శూర...కర్ణ" చిత్రానికి దర్శకుడుకూడా ఆయనే.

(పౌరాణిక పాత్రలకు అద్వితీయ రూపకల్పన చెయ్యగలిగిన ఒకే నటుడు ఎన్టీఆర్ అన్నది ప్రజాభిప్రాయం.)

### పాత్రధారులెవరు ?

"దాన ... వీర ... శూర ... కర్ణ" చిత్రంలో భీముడుగా సత్యనారాయణ, శకునిగా ధూళిపాళ, అభిమన్యుడుగా బాలకృష్ణ, భీష్ముడుగా మిక్కిలినేని, శల్యుడుగా మల్లాది, ధృతరాష్ట్రుడుగా ముక్కామల, దుర్యోధనుని ధర్మపత్ని భానుమతిగా ప్రభ నటిస్తున్నారు.

ద్రౌపది, ఉత్తర, కుంతీదేవి పాత్రలను ప్రముఖులు పోషించగలరని నందమూరి చెప్పారు.

### చాణక్య ... చంద్రగుప్త

'నటసమ్రాట్' చాణక్యుడుగా, 'నటరత్న' చంద్రగుప్తుడుగా, ఎస్వరలక్ష్మి మురగా నటిస్తున్న "చాణక్య ... చంద్రగుప్త" వర్ణ చిత్రం కూడా డిశంబరుకల్లా రెడీ కాగలదని, ఆదనుచూచి ఆ చిత్రాన్ని విడుదలచెయ్యాలని ఎన్టీఆర్ నిర్ణయించారు.

పై రెండు చిత్రాలకు పెండ్యాల సంగీతానికి, కన్నప్ప ఛాయాగ్రహణానికి ఆధిపత్యం వహిస్తున్నారు.

— శ్రీనివాస్

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

**ఎన్. వి ఆర్. జె కె - భీమవరం**

స్త్రీ అడుగడుగునా అవమానాలు భరిస్తూ జీవచ్ఛవంలాగా బ్రతకడానికైనా సిద్ధపడేది పూర్వం కాని యిప్పుడు ?

అలా బ్రతులేక, ఇంకోలా అదే - మనిషిలా బ్రతికే దారి తెలియక మరీ బాధ పడుతోంది ఈ సంఘంచాలా విచిత్రమైంది· ఆడది చదువుకో వచ్చును· కాని ఆ చదువువల్ల ప్రభావితురాలైతే తప్పు! ఆడది సంపాదించవచ్చు కుటుంబాన్ని ఆదుకునే ప్రయత్నంలో చేయూత నివ్వవచ్చు· కాని సంపాదన యిచ్చే ఆత్మ విశ్వాసాన్ని ప్రదర్శించకూడదు సంపాదన యిచ్చే ఆత్మ గౌరవం కనిపించనివ్వకూడదు ఆర్థిక స్వాతంత్ర్యం విద్యాగంధం యిచ్చే ధైర్యం కనపరచిన ఆడదాన్ని ముఖం ముందు మెచ్చినా వెనక ఈసడిస్తారు ఎంత పొగరు అంటూ. అందుకే ఈ ఆధునిక సంధి యుగంలో చదువుకున్న ఆడది, సంసారం సంపాదన చేస్తున్న ఆడది మరీ నల్గిపోతుంది. మరీ జీవచ్ఛవంగా బ్రతుకుతూంది పూర్వపు ఆడదానికి చదువులేక, పరిస్థితులు మేలు పడే అవకాశం లేక గయ్యాళిగా నోరు పెట్టుకుని గాని, మన్ను తిన్న పాములా పడివుండిగాని బ్రతుకు సాగించేయ గల్గేది విద్య యిచ్చిన సంస్కారం వల్ల యీనాటి చదువుకున్న ఆడది ఏదీ చేయలేక పోతూంది. గుండెల్లో హాలాహలాన్ని, ఆవేదనని దాచుకుని నలుగురిలో పరువుకోసం, పిల్లల భవిష్యత్తుకోసం పెదవులపై చిరునవ్వు అతికించుకుని తిరుగుతుంది

**టి ఎమ్ మారుపల్లి**

స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు యిచ్చినచో పురుషులకు ఈర్ష్య కలగడమే కాకుండా స్త్రీలు తమ బరువు బాధ్యతలను మరిచి పోగలరంటారా ?

ఎలాంటి బరువు బాధ్యతలు ఇష్టం వున్నా లేక పోయినా, ఓపిక వున్నా అంతరించినా పిల్లల్ని కనడం లాంటిదా ? చచ్చేలా తన్నినా, బానిసలా చూసినా పడివుండడం లాంటిదా ? మనిషిలాగానే చూడని భర్తని దేవుడిగా ఎంచి భారతనారీపతివ్రతా ధర్మాన్ని అక్షరాలా పాటించడమా ఎలాంటి బరువు బాధ్యతలండీ స్త్రీలు మరిచేది ? పురుషులకి అధిక హక్కులిస్తే ఇన్నాళ్లు ఏం చేశారు ? ! ఇప్పుడు సమాన హక్కులిస్తే ఎందుకింత భయపడి పోతున్నారు ?

**జి. వి. ఆర్ విజయవాడ**

ప్రతి చిన్న విషయానికీ పెద్ద రాద్ధాంతం లేవదీసే మీ స్త్రీజాతికి బుద్ధి రాదా?

వస్తే మీకే ప్రమాదంకదా అయినా చిన్న విషయాలు పట్టించుకోనివాళ్లు పెద పెద్ద విషయాల్లో సిసలైన కుతూహలం చూపెట్ట కలరా అని నా అనుమానం!

**డి. కె. బి. పి డొంకరాయి**

మనసు తొందరగా అర్థంచేసుకునేది స్త్రీయా? పురుషుడా?

మనస్సుతో మాట్లాడకల స్త్రీలే మనస్సు అర్థం చేసుకుంటారు.

**టి ఆర్. సికిం దాబాదు**

ప్రేమికుల దృష్టిలో ఈ లోకం ఏలా వుంటుందో ?

సెక్రటరీలో రాజసేఖరం యిల్లులాగ !

**ఎమ్. ఆర్. ఎఫ్. కొత్తగూడెం**

నటీ నటులు, నిర్మాతలు, దర్శకులు, కవులు ఎంతోమంది ఎన్నెన్నో పత్రికలలో సమాధానాలిచ్చి మెప్పులు పొందారు పొందుతున్నారు. మీలా సమాధానాలిచ్చి ముక్కతిట్లుతిన్నది తింటున్నదీ మీ రొక్కరే.

గుడ్ ఏదో రకంగా ప్రత్యేకత ఏడవాలి ! లేకపోతే ఉట్టి మెప్పుకోసం నేనురాస్తాను "చిత్తం చిత్తం, నాభాగ్యం మీదయ"లాంటిది ! !

**పి వి ఎన్ రాజం పేట**

ఎన్నో రోజుల నుంచి నాకొక అనుమానం ఉంది అదేమిటి అంటే ప్రశ్నావళి శీర్షికలో స్త్రీ పక్షపాతం చూపిస్తున్న మీరు అన్నీ మీ ఆడవారి ఉత్తరాలే వేసుకోకూడదా?

నిజం చెప నా? అప్పుడాడవాళ్లు చదవరు!!

## చక్లీ

కావలసిన వస్తువులు : డాల్డా అరకిలో, బియ్యంపిండి పావుకిలో, మినప్పప్పు అరకిలో, వాము చటాకు, ఉప్పు తగినంత మొదట మినప్పప్పును నానబెట్టి బాగ కడిగి మెత్తగా గట్టిగా కాటుకలా రుబ్బుకోవాలి. తర్వాత ఈ రుబ్బిన మినప్పిండిలో, బియ్యం పిండీ, ఉప్పు, మెత్తగా నూరిన వామూ, వేసి బాగా కలపాలి. (బియ్యంపిండి వేసి కలిపేటప్పుడు ఇంక నీళ్లు పొయ్యనవసరంలేదు) తర్వాత ఈ పిండిని నిమ్మకాయంత సైజులో ఉండలు వేసుకోవాలి ఆ తర్వాత వెడల్పాటి భాణలిలో డాల్డా పోసి కాచి అందులో జంతికిల గొట్టం (నక్షత్రపు బిళ్ల) సహాయంతో ఒక్కొక్క ఉండనే చక్రాలులా చక్కగా తిప్పుకుని ఎర్రగా దోరగా కరకరలాడేటట్లు వేయించుకోవాలి ! ఈ "చక్లీ" లు మూడునెలలయినా పాడవకుండా కరకరలాడుతూ నిలవ ఉంటాయి

— జి రామలక్ష్మి (హైద్రాబాద్)

సహృదయంతో లాలన ఆప్యాయతలతో సమాజమందలి మనుష్యులల్లో మార్పుతేవాలిగాని అని పాత మాటలు కాలానుగుణంగా పద్ధతులు మారాలి ఈ రోజు మెత్తని వాళ్లు చేతకానివాళ్లుగా చెలామణి అవుతున్నారు నోరు లేనివాళ్లు తెలివి తక్కువ వాళ్లుగా అనిపిస్తున్నారు పడి ఉంటే పిరికితనంగా జమకట్టుతారు తిరగబడితే భయపడుతున్నారు తోక పట్టుకులాగితే పాము బుస కొట్టక మానదు కద! బుస కొట్టకూడదు అంటే మీరు నేలకేసి కొట్టి చంపుతారు! 'సరస చతురోక్తుల సమాధానపరచడం పాత పద్ధతి చెప్పదలిచినది కష్టణ్ణంగా చెప్పి తిన్నగా బుర్రకెక్కేలా చేయడం కొత్త పద్ధతి

**ఎస్. వి. కరీంనగరు**

బాధ లేకుండా ఉండాలంటే?

బ్రతికి ఉండకూడదు!

**ఎ ఆర్. ఆర్. వైజాగ్**

మీరు వైజాగు ఎప్పుడేనా వచ్చారా ? వస్తే ఏ కారణంవల్ల వచ్చారో తెలుపగలరా ?

వచ్చాను ! పిచ్చాసుపత్రికి కాదు అది మా అత్తవారి వూరు!

**డి. ఎమ్ నిజామాబాద్**

ఏమండీ, మీరు విద్యార్థులు, పెద్ద పదవులు కలవారికి మాత్రమే ప్రశ్నలకు జవాబులిస్తారా ?

ప్రశ్నలో విద్యార్థులు పెద్ద పదవులు కలవారో ఎలా తెలుస్తుంది సోదరా, ఇలాంటి ప్రశ్నకేం చెప్పాలో తెలియదు నాకు

**టి ఆర్. ఆర్. మిర్యాలగూడ**

తోటి ఆడదాన్ని చూసి మరో ఆడది ఓర్వలేదు కాని మీరేమో అందుకు విరుద్ధంగా కనిపిస్తున్నారు

నాకు తోటి ఆడవారితో పోటీలేదు నేను, 'తోటి ఆడదానిలాగే ఉండి, ఆమెలాగే నగలు చీరలు, ఇల్లువాకిలి, చివరికి వంటకాలు చేస్తూ పోటీగా బ్రతకాలని అనుకోను పొరుగింటిపుల్లకూర రుచి అన్న చచ్చుసామెలకూడా నమ్మను నేను ఎవరింటి కూర రుచి వారిది వాళ్లింట్లో వాళ్లు, మనింట్లో మనం అనుకున్నప్పుడే పోటీలు, నాటీ పోటీ మాటల్లో అర్థం ఏముంటుంది ? ఉండదు అందుకే సాటి ఆడదానితో నాకు పేచీ లేదు. రాదు

**టి ఆర్ పి గూడూరు**

జీవితాంతం ఒకే ఆడదానితో సంసారం చేయడం బోర్ మీరేమంటారు?

పెళ్లిమాట తలపెట్టవద్దంటాను

**కె. ఎస్ బి. కె. జె బి కాజూరు**

భట్రాజు పొగడ్తలంటే ఎలా ఉంటాయి ?

ఎప్పుడూ సన్మానసభలు చూడలేదా ? దాంట్లో సన్మానితుణ్ణి గురించి మాట్లాడ్డమే భట్రాజు పొగడ్తకు ఉదాహరణ! ●

మన సంగీత దర్శకుల్లో మహదేవన్ తరువాత పేరున్నది సత్యానికే అనెడి మాటను ప్రేక్షకులు అనగా విన్నాడు, యీ విలేఖరి.

సత్యం సంగీతం సమకూర్చే చిత్రాల్లో రెండు పాటలు (కనీసం) శ్రోతలను ఆకట్టుకుంటాయి అనెడి నిజాన్ని ఎవ్వరూ కాదనరు.

ఈమధ్య ఒక మంచి పాటను సృజన కంబైన్స్ వారి "తొలిరేయి గడిచింది" చిత్రానికిగాను, సత్యం తయారుచేశారు.

డాక్టర్ నారాయణరెడ్డిగారి కలం గూర్చి ప్రశంసించాలా, సత్యం కూర్చిన బాణీ గూర్చి రాయాలా లేక సుశీల... బాలుగార్ల గానం గూర్చి తెలపాలా అన్నంతగా ఆ పాట రూపం అందుకుంది.

## సినిమా విశేషాలు

అంత మధురమయిన పాటను గూర్చి కొంత రాయకపోతే ఎలా ?

"ఈ తీయని వేళ, నా వూహాలలోన
మల్లెలు విరిసె ! తేనెల్లు కురిసె !
జల జల జల జల"

తేనెలొలికే యీ పాటను జయచిత్ర... మురళీమోహన్‌లపై చిత్రీకరించబోతున్నట్టు, దర్శకుడు కె. ఎస్. రామిరెడ్డి చెప్పారు.

### పల్లెసీమల్లో షూటింగు

"తొలిరేయి గడిచింది" చిత్రం షూటింగు గోపాలకృష్ణారెడ్డి నిర్ణయించారు. నెల్లూరు సమీపాన గల పచ్చని పొలాల్లో, అక్కడే వెలసివున్న భవంతుల్లో షూటింగు జరపడానికి నిశ్చయించినట్టు, ఎగ్జిక్యూటివ్ నిర్మాత భక్తవత్సలరెడ్డి చెప్పారు.

"తొలి రేయి గడిచింది" చిత్రం గాఢానురాగ బద్ధులైన ప్రేయసి ప్రియుల మధ్య జరిగిన కథ అని, కథలో అన్ని రసాలు వున్నాయి అని, రచయిత గణేష్‌పాత్రో వివరించారు

ఈ చిత్రంలో సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, మాడా, రమాప్రభ, మోహన్‌బాబు మరియు విజయలలిత ప్రధాన తారాగణం.

---

మొదటి రాత్రికి ముఖ్యం. ఇవ్వాళమాత్రం కాదన కూడదు. మీ అమ్మగారు నన్ను కోప్పడతారు. తొందరగా తెములు !"

"వదినా ! నా కిలాంటివేమీ ఇష్టంవుండవని నీకూ తెలుసు. బావకి ఎంత దూరంగావుంటే నాకంత మనశ్శాంతి ! యివాళ్టి నీ హడావుడి నా మనసుకి విరుద్ధంగా వుంది. నేనీవేళ బావ దగ్గిరకు వెళ్ళలేను. నా మనసేమీ బాగోలేదసలు !"

విజయ దృఢనిశ్చయం విన్న జానకి అంతవరకూ ఉత్సాహంగా వున్నదల్లా నీరుగారిపోయింది. ఒక భావం ఎదటి మనిషిమీద ఏర్పడిన తరువాత ఇంకా ఆ భావం ఎప్పటికీ పోదు పోగొట్టటం అంటే అంత తేలికకాదు. అయినా యీ రాత్రికి ఎలాగో విజయను గదిలోకి పంపకపోతే భర్తనుంచి, అత్తగారినుంచి చివాట్లు తప్పవు అనుకున్నది. ఎలాగయినా విజయను బ్రతిమాలి దారికి తేవాలనుకుంది. చేతిలోని చీరెను మంచంమీద పెడుతున్న విజయను వారించే ఉద్దేశ్యంతో తొందరగా చెయ్యి పట్టుకుంది.

"విజయా! యివి చేతులుకాదు ! కాళ్ళు..."

"వదినా !" చప్పున జానకి చేతులు పట్టుకుని నోరు మూసింది సంభ్రమంగా; జానకి రెండు భుజాలమీద చేతులుంచి విజయ అంది —

"నీ మనసు యింత బాధపడుతుందనుకోలేదు. నువ్వు నా వయస్సుదానివయినా పెద్దదానివి బాంధవ్యంలో ! నీ మాటప్రకారం యీ తెల్లచీరె కట్టుకుని బావ దగ్గిర కెళ్తాను. ఇంక ఆ తరువాత ఏ విషయంలోనూ నువ్వు పట్టించుకోకూడదుమరి! యీ షరతుకి నీవు అంగీకరించితే తెల్లచీర కట్టుకుంటానుమరి !"

జానకి అంగీకారంగా తల పంకించింది. "నువ్విలా షరతు పెడితే నేనసలు భరించలేను. అయిపోయినదేదో అయిపోయింది. మంచికో చెడుకో మీ యిద్దరు భార్యాభర్తలయ్యారు. భవిష్యత్తుని గురించి ఆలోచించాలి ! తప్పదు ఆడదానికి ! అయినా నీ బెట్టు కాసేపేలే ! మరోగంటకి అన్ని ఛీత్కారాలూ ఎక్కడి వక్కడికి పారిపోతాయి. అప్పుడివన్నీ గుర్తేవుండవు !" అంది జానకినవ్వుతూ.

"అది అంత తేలిక అనుకున్నావా వదినా ?"

"విజయా ! అనవసర ప్రసంగంతో కాలక్షేపం చేస్తున్నావుగాని పదకొండు గంటలయింది. శ్రీధర్ అక్కడ; నువ్విక్కడ ! పిలిచి అవమానించారని అతను అనుకుంటే ? అలాంటివాటికి ఆస్కారం యివ్వకుండా తొందరగా చీర కట్టుకో ! నాకూ నిద్ర ఆగటంలేదు మరి !" ఆవలిస్తూనే చీర మడతవిప్పి విజయ కిచ్చింది. తప్పదన్నట్లుగా చీర కట్టుకుంది. అంతలోనే సందేహం వచ్చింది విజయకి.

"వదినా ! గదిలో సగంమేర పళ్ళు ఫలహారాలతో నింపలేదుకదా ?"

"అవన్నీ నీ కిష్టంకాదని నాకు తెలుసు అందుకని నీ బీరువాలో అరడజను యాపిల్సు, లడ్డూలు ప్లేటులో పెట్టి వుంచాను. అవసరం అయితే తీసుకుని యిద్దరూ తినండి. చీర సింగారించటం అయింది కాదూ ? పద తల్లీ ! నిద్ర వచ్చేస్తోంది" ఆవలిస్తూనే అంది మరలా.

"నువ్వెందుకు వదినా బాడీగార్డులాగా ? నేను వెళ్ళలేనా ?"

"నన్ను ఏ మార్చి ఏ స్టోరు రూంలోనో పడుకుంటే రెపు శ్రీధర్‌కి నా ముఖం చూపించగలనా?? మీ యిద్దరూ అక్కడే తేల్చుకోండిగాని కబుర్లతో యిక్కడ గంటల తరబడి గడపాలని చూశావంటే వప్పుకోను ! పద ముందు మేడమీదకి !" మందలింపుగా అంది.

"బావ నాకు పరాయివాడా? సిగ్గుపడటానికి?? అయినా నా గదిలోకి నేను వెళ్ళటానికి సిగ్గెందుకు పడాలి ? నువ్వెళ్ళి హాయిగా నిద్రపో ! వస్తా ! గుడ్ నైట్ వదినా !"

"గుడ్‌నైట్ మరదలా? తెల్లచీర కట్టుకున్నది ఎవరికోసం ? మల్లెపువ్వులు పెట్టుకున్నది ఎవరికోసం ? అన్నది గుర్తుపెట్టుకుని మరీ గదిలోకి అడుగుపెట్టు తెలిసిందా ?" అంది రాగయుక్తంగా,

విజయకి నవ్వు ఆగలేదు. పమిటచెంగు చాటు చేసుకుని నవ్వుకుంది. నవ్వుకుంటూనే మేడమెట్లు ఎక్కింది. పై మెట్లు వరకూ వెళ్ళినతరువాత మెట్ల తలుపులు గడియ వేసింది విజయ తిరిగి క్రిందకు రాకుండా ! పైకి వెళ్ళేసరికి గదిలో లైటు యింకా వుండటం చూసి అరే ! బావ యింకా పడుకోలేదా ? అనుకుంటూ ఉదాసీనంగా లోపలికి వచ్చి సోఫాలో కూర్చుని టీపాయ్‌మీద వున్న వారపత్రిక తీసుకుని పేజీలు తిరగవేస్తూ తల వంచుకుంది. శ్రీధర్ పేపర్‌లోని ఒక్క అక్షరంకూడా వదలకుండా చదివేశాడు విజయ వచ్చేసరికి అయినా యింకా పేపర్‌లోకి చూస్తూనే వున్నాడు. అతని మనసు అలజడిగా వుంది పేపర్‌లోనుంచే విజయ ముఖంలోకి చూశాడు. చాలా మామూలుగా వుంది. ఎలాంటి భావమూ శ్రీధర్‌కి కనిపించలేదు. ఎంతో ఉదాసీనంగా సోఫాకి ఆనుకుని కూర్చుంది కొత్త పెళ్లికూతురిలా ఎలాంటి అలంకరణా లేదు ! కట్టూ బొట్టు వేషధారణ అతి సాధారణంగా కనిపించాయి శ్రీధర్‌కి వివాహంనాడు శ్రీధర్ కట్టిన రెండు వరసల బంగారు గొలుసుమధ్య సూత్రం గ్లాస్కో చీర పల్చటి పొర క్రిందనుంచీ కనిపించుతోంది స్పష్టంగా ! అంతకు మించి మెడలోకూడా యింకేమీ లేవు. అసలు కృత్రిమ అలంకరణమీద విజయకు అసహ్యం. ఎప్పుడూ ఫుల్‌వాయిల్ చీరలు తప్పితే నైలెక్సులు టెర్లిన్ చీరలంటూ అసలు వాడదు. ఆఖరికి పౌడరుకూడా వాడదు. చాలా మామూలుగా వుంటుంది ఎప్పుడు చూసినాను. విజయ కూర్చున్న తీరు; కట్టుకున్న తెల్లచీర ఆమెకు ఎంత అందాన్ని యిస్తున్నాయి అమాంతంగా విజయను కౌగిలిలో బిగించి తనివితీరా ముద్దులతో ముంచెత్తాలనిపించేటంత ఆవేశం కలిగింది. కాని సమీపించటానికి ధైర్యం, చొరవా లేకపోయాయి. మగవాడు ! తనకి లేకపోతే, ఆడది విజయ కెలా వుంటాయి ? నాలుగు సంవత్సరాల తరువాత విజయను యింత దగ్గిరగా నఖశిఖపర్యంతం చూసింది యిప్పుడే. అప్పటికి యిప్పటికి విజయలో మార్పు కనిపించలేదుగాని బాగా సన్నబడినట్లు కనిపించింది శ్రీధర్ కళ్లకు. పేపర్‌ని మడిచి డ్రాయర్‌మీద పెడుతూనే అలారంవంక చూశాడు. సరిగ్గా రెండు ముళ్ళూ పన్నెండుమీద వున్నవి. మరో నాలుగుగంటలకు తెల్లవారబోతోంది. ఇద్దరం యిలాగే జాగరణ అయితే ఎలా ? అనుకుంటూ కుర్చీలోనుంచి లేచి విజయ కూర్చున్న సోఫా దగ్గిర కొచ్చి నిలబడ్డాడు. అతనలా నిలబడటం; తనవంకే తదేకంగా చూస్తూంటంతో విజయ గుండెలు దడదడలాడాయి. అయినా ఏదో పట్టుదల; కసి ఆమె నరనరాల్లోనూ నిలిచిపోయింది. తన కిష్టం లేనిదే శ్రీధర్ బలవంతం చెయ్యలేడని తెలుసు విజయకి. అతనంత చేరువగా నిలబడినా కన్నెత్తి శ్రీధర్ వంక చూడలేదు. [ ఇంకా వుంది ]

అజ్ఞాతశక్తుల ప్రభావం...ప్రతిభ ఎంతటిదో యీమధ్య నిరూపణ అయ్యింది. "తిరపతి" చిత్ర నిర్మాత హనుమాన్‌ప్రసాద్ "దేవుడు చేసిన బొమ్మలు" చిత్రానికి దర్శకుడు అయినరోజున, గిట్టనివాళ్ళు కష్టపడ్డారు.

"కష్టే ఫలే" అనెడి నిజానికి న్యాయం చెయ్యగల ప్రసాద్ దర్శకుడుగా తనేమిటో "దే. చే. బొ." చిత్రం ద్వారా ఋజువుచేశాడు.

"దేవుడు చేసిన బొమ్మలు" చిత్రాన్ని అందరికీ నచ్చేవిధంగా దర్శకుడు ప్రవర్తించాడు అని రాయడానికి యీ విలేఖరికి అభ్యంతరంలేదు. దర్శకుడుగా శక్తిమేరకు న్యాయంచేశాడు, హనుమాన్ ప్రసాద్.

## జయసుధ అద్భుత నటన

"దేవుడు చేసిన బొమ్మలు" చిత్రంలో అందరూ వారి పాత్రలకు పూర్తి న్యాయంచేశారు. మొదటి మార్కులు జయసుధకు యివ్వాలిమరి. ముఖ్య పాత్రలను పోషించిన చలం, ప్రభ, మురళీ మోహన్, అనిత, కొమ్మినేని గణనీయమైన నటన్ను ప్రదర్శించారు.

జంధ్యాల సంభాషణల్లో చురుకుదనం, సత్యం సంగీతంలో మాధుర్యం చిత్రానికి సహకరించాయి. ప్రసాద్ ప్రతిభావంతుడు అని "దే. చే. బొ." చిత్రం ప్రేక్షకులచేత అనిపిస్తుంది.

## తర్వాతి చిత్రం నాయిక?

తను తీసే ప్రతి చిత్రంలో జయసుధ నాయికగా వుంటుంది అనెడి నిజాన్ని హనుమాన్ ప్రసాద్ వెల్లడించారు.

ఆగస్టు 15న తన రెండవ చిత్రం ప్రారంభం అవుతుందని, "దేవుడు చేసిన బొమ్మలు" చిత్రానికి పని చేసిన సాంకేతికవర్గమే కొత్త చిత్రానికి పని చెయ్యగలరని, ప్రసాద్ చెప్పారు.



'రామరాజ్యంలో రక్తపాతం' లో ఒక దృశ్యం

## కౌముదీలో జయసుధ!

కౌముదీ పిక్చర్స్ నిర్మించబోయే ప్రేమ కథలో జయసుధ ముఖ్య పాత్రధారిణిగా వుండగలదన్న నిజాన్ని, నిర్మాత ఎమ్. ఎస్. రెడ్డి చెప్పారు.

ఆగస్టు యిరవైఅయిదున షూటింగు ప్రారంభమై, అక్టోబరు చివరన పూర్తి అయ్యే విధంగా షెడ్యూల్సు వేశారు, కథకుడు మల్లెమాల.

ఒక షెడ్యూలు మాత్రం యిన్‌డోర్‌లో జరిపి, మిగతా రెండు షెడ్యూల్సు అవుట్‌డోర్‌లో జరపడానికి నిశ్చయించారు, రెడ్డిగారు.

ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకత్వాన్ని, సత్యం సంగీతాన్ని నిర్వహించగలరని నిర్మాత వెల్లడించారు.

## జనవరి నుంచి శోభన్ కాల్‌షీట్లు

కౌముదీ అధినేత ఎమ్. ఎస్. రెడ్డిగారంటే, శోభన్‌బాబుకు ఎంతో గౌరవం. మంచి చిత్రాలను నిర్మించే ఉత్తమాభిరుచిగల నిర్మాత రెడ్డిగారు అని శోభన్ పదేపదే అంటూవుంటారు.

ఈమధ్య రెడ్డిగారు, శోభన్‌బాబుకు ఒక తమిళ చిత్రాన్ని చూపించారు. ఆ చిత్రంలో నటించడానికి శోభన్ అంగీకరించారు.

డిశంబరు వరకు డైరీప్రకారం డేట్స్ వీలుపడనందున, జనవరి నుంచి రెడ్డిగారికి కాల్‌షీట్లు యివ్వడానికి శోభన్ సుముఖంగా వున్నారు.

"కోడెనాగు" చిత్రం తరువాత కౌముదీలో శోభన్‌బాబు నటించడం జనవరిలో ఆరంభమవుతుంది.



'నేరం నాదికాదు ఆకలిది'లో రామారావు

## జయసుధకు అందరి దీవెనలు

"జ్యోతి" చిత్రాన్ని చూచినవాళ్ళందరూ జయసుధను మనస్పూర్తిగా అభినందించారు. జయసుధలో యింతటి నటనాశక్తి వున్నదా అని ఆశ్చర్యాన్ని ప్రకటించారు. "క్వీన్ ఆఫ్ నవరసమ్స్" అని ప్రశంసించారు.

ప్రముఖ నటీనటులు, విఖ్యాత దర్శకులు, జయసుధను జయించావు అని దీవించారు.

పరిశ్రమలో జయసుధ స్థానం పదింతలు పెరిగినట్టే, ప్రేక్షకుల్లో ఆమె పలుకుబడి పదింతలు అధికమయ్యింది.

రాబోయే సంవత్సరాల్లో జయసుధ అద్వితీయమైన స్థానాన్ని తనదిగా చేసుకోగలదన్న నమ్మకం మంచివాళ్లకు వుండడంలో ఆశ్చర్యంలేదు.

## వెరైటీ పాత్రలు!

వయస్సులో చిన్నదేగాని, నటనలో సమర్దురాలే అని అందరిచేతా అనిపించుకుంటున్న జయసుధ ప్రతిభకు ఆమెకొచ్చే పాత్రలు ముఖ్యకారణం అని చెప్పొచ్చు.

"జ్యోతి"లో పాత్రకు, "అల్లుడొచ్చాడు" లోని పాత్రకు ఎంత వ్యత్యాసం వుందో, "రాజా వెడలె" లోని వేషానికి, "దేవుడు చేసిన బొమ్మలు" లోని వేషానికి అంత తారతమ్యం వుంది.

గ్లామర్‌తోబాటు నటనాసామర్ధ్యం వున్న నటిగా జయసుధను పేర్కొంటే, ఎవ్వరికీ యిబ్బంది వుండదనుకొంటా.

ప్రస్తుతం జయసుధ అంగీకరించిన చిత్రాల్లో వెరైటీ వేషాలు దొరకడం, ఆమె చేసుకున్న అదృష్టం అనక తప్పదు.

## పెద్ద సంస్థలు!

ప్రజల్లో పేరు ప్రఖ్యాతులు వున్న పెద్ద సంస్థల్లో జయసుధకు ప్రవేశం దొరకడం... బంగారు భవిష్యత్తుకు దారి తీస్తుందనడంలో సందేహంలేదు.

# పెరిగే ప్రతి దశలోనూ శరీరానికి కావాలి కాల్షియం-శాండోజ్®



కాల్షియం, గర్భంలోని శిశువు ప్రథమ దశలోనే పాల పళ్ళలోనూ, ఎముకలలోనూ చేరు కోవటం మొదలెడుతుంది. పుట్టబోయే శిశువుకు శీఘ్రగతిలో ఎక్కువగా కాల్షియం కావాలి. అందుకే, మీకు మామూలు కన్న రెండు రెట్లు కాల్షియం కావాలి. మీరు తొందర గానే కాల్షియం-శాండోజ్ తీసు కోవటం మొదలెట్టండి.



పాల ఎముకలు, పళ్ళూ పటిష్ఠత కోసం కాల్షియం లభించేది పాలిచ్చి పెంచే తల్లి ద్వారానే. ఆమెకు మామూలుకన్న మూడు రెట్లు కాల్షియం అవసరం.

పెరిగే పాపకు పటిష్ఠమైన ఎముకలూ, గట్టి పళ్ళ కోసం కాల్షియం ముఖ్యావసరం. అందుకే, పెద్ద వాళ్ళ కన్న, పాపకు కాల్షియం ఎక్కువగా కావాలి!





కాల్షియం ప్రతి దశలోనూ, ప్రతి వయసులోనూ, శరీరానికి కీలకమైన అవసరం. మరి కాల్షియం-శాండోజ్‌లో, కాల్షియం ఉత్తమోత్తమైన రూపంలో ఉంది. రోజుకు రెండు సార్లు, రెండు తేదా మూడు రుచిగల, రాస్ప్ చెరీ-వాసన గల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు, మీకు అవసరమైన కాల్షియం యిస్తాయి. దానితో బాటే విటమిన్ సి, డి మరియు బి$_{12}$.

**శాండోజ్‌ను విశ్వసించండి-ప్రపంచమంతటిలో కాల్షియం తయారీలో అగ్రగాములు.**




## కాల్షియం-శాండోజ్®
## బిళ్ళలు ప్రతి రోజూ ప్రతి వారికీ

dCA/CS/15 F TEL.

# డాక్టర్ సలహాలు

—డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**టి. కె. కె. — తాడిపత్రి**

స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్ల బదులు ఏమైనా మాత్రలు వుంటే తెల్పండి.

★ "స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్లు యివ్వకుండానే క్షయ రోగాన్ని మాత్రలు మాత్రమే వాడి నయం చేయటానికి ప్రస్తుతం వీలు వున్నది. ఐసోనెక్స్, పి. ఎ. ఎస్; తయూసిటజోన్ మొదలయిన మాత్రలు విడిగాను, ఒకదానితో ఇంకొకటి కలిపి వాడటం ద్వారా యీ రోగం నయం చేయవచ్చునని ప్రపంచమంతటా నిరూపించబడి వాడబడుతున్నవే! ఇంజక్షన్లు వాడకపోతే మాత్రలు వాడితే రోగం నయమవదన్న నమ్మకం ప్రస్తుతం ప్రజలలో వున్నదే కాబట్టే, అది తప్పని చెప్పవలసిన కర్తవ్యం ప్రతి వైద్యునిదీ, వైద్యేతరులదీ అవుతుంది.

**వై. — తిరుపతి**

మా బాబుకి 8 నెలలు. మోషన్ అయ్యేటప్పుడు విపరీతంగా ముక్కుతాడు. మోషన్ లూజుగా అయినాగూడా ముక్కుతాడు. బాబుకి డబ్బాపాలు వాడుతున్నాము. "ఏనల్ ఫిషర్స్" వున్నాయని ఆయింట్‌మెంట్సు వాడాము. కాని ఏమీ తగ్గలేదు.

★ మల విసర్జన సమయంలో శరీరంలోని ఇతర కండరాల పటుత్వం, శక్తి, అవసరం అవటం అనేది మల విసర్జన జరిపే ప్రేవులలోని కండరాల పటుత్వం తగ్గిపోవటం వలననే జరుగుతుంది. ఈ కండరాల పటుత్వం తగ్గటం అనేది, పుట్టుకతోనే ఏర్పడకలిగే ప్రేవులలోని నిర్మాణాత్మక మార్పులు; పుట్టుక తర్వాత ఆహార విధానాలు మొదలయినవాటివల్ల జరుగవచ్చును.

"ఏనల్ ఫిషర్స్" అనేది చంటిపిల్లలకి రావటం చాలా అరుదు అనే చెప్పాలి. మీ బాబుకి ఆహార విషయాలని గురించి తగిన శ్రద్ధ చూపండి. పాలు ఇవ్వటానికి మధ్యలో కాచి చల్లార్చిన నీళ్లని వాడటం, బత్తాయి రసం వాడటం, మంచిది.

మోషన్—లూజుగా ఉన్నా—శ్రమ పడటం అనేది కండరాలు తగిన పటుత్వాన్ని కలిగిలేవని తెలియజేస్తున్నది.

**ఎస్. జి. బి. — కర్నూలు**

నా వయస్సు 20 సం.లు నాకు ఒక సం నుండి పై పెదవిపైన ఒక అంగుళముమేర నల్లని వెంట్రుకలు మొలిచినాయి. కొన్ని ఆయింట్‌మెంట్లు, పసుపు వాడినాను. కాని ప్రయోజనం కన్పించలేదు.

★ వెంట్రుకలు సహజత్వానికి విరుద్ధంగా ఒకచోట మాత్రమే రావటం, అందులోనూ స్త్రీలలో ఏర్పడటం వారిలో ఏర్పడిన హార్మోనుల ఉత్పత్తిలోని మార్పులనే తెలియజేస్తుంది. గతంలో చాలాసార్లు తెలియజేసినట్లూనే స్త్రీ, పురుష లిరువురిలోనూ, ఇద్దరి ప్రత్యేకతలను ఎత్తిచూపే హార్మోనులు ఉత్పత్తి అవుతాయి. అయితే మామూలుగా స్త్రీలలో పురుషతత్వ హార్మోన్లు, పురుషులలో స్త్రీతత్వ హార్మోన్లు నాశనం చేయబడతాయి (లివర్‌లో). ఇలా జరుగకపోయినా, లేక ఈ మార్పు మందగించినా, మీరు వ్రాసిన లక్షణాలవంటివి ఏర్పడతాయి, దీనికి వైద్యంగా, మీరు స్త్రీ సహజ "ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్" అనేవాటిని వైద్య పర్యవేక్షణలో వాడటం మంచిది.

**జి. ఎస్. బి. — ఏలేటిపాడు**

మా పిన్నికి ఇప్పటికి 9 కాన్పులు అయినవి. మొదటి ఆడపిల్ల, మధ్యలో పుట్టిన ఆడపిల్ల క్షేమముగా వున్నారు. మొగపిల్లలు మాత్రం ఒక్కళ్ళుగూడా బ్రతకలేదు. గర్భిణిగా వున్నప్పుడు డాక్టరు సలహాలపై అనేక మందులు వాడాము. అయినా మగపిల్లలు జీవించలేదు. ఇక మగపిల్లలెందరు పుట్టినా ఇంతేనా?

★ పుట్టిన మగపిల్లలందరూ చనిపోవటం అనేది—ఏదో ఒక లోపం అంటే మొదటిసారిగా ఒకరిద్దరు పుట్టిన మగపిల్లలు చనిపోగానే వారికి ప్రత్యేక శ్రద్ధ చూపే మిషతో నిజంగా అశ్రద్ధ జరగటమో లేక అత్యాశక్తివల్ల మామూలుగా ఆలోచించే పరిజ్ఞానము నశించటం జరిగే అవకాశం ఉన్నది. ఈ కారణం తప్పితే ఎక్కువగా వేరే యితర కారణాలేమీ లేవు. ఇక పుట్టబోయే మగపిల్లలను గురించి ముందుగానే చెప్పటం—వైద్య శాస్త్ర సమ్మతం కానేకాదు!

**ఆర్. ఎస్. — హైదరాబాద్**

మా తమ్ముడి వయస్సు 13 సం.లు. కళ్ళు తిరిగినట్లు వచ్చి కనుచూపు ఒక ప్రక్కన ఆగిపోతుంది. నాలిక కొరుక్కుంటాడు. స్పృహ వుండదు. 5, 6 నిమిషాలకు స్పృహ వస్తుంది. ఈ జబ్బు ఎందువలన వస్తుంది? నిద్రమాత్రలు వాడితే ప్రమాదమా? ఈ జబ్బు వచ్చినపుడు ఎవ్వరూ లేకపోతే ఏమైనా ప్రమాదమా?

★ ఈ రోగాన్ని "ఎపిలెప్సీ" అని ఆంగ్లంలోనూ, "అపస్మారం" అని మన వైద్య—వ్యావహారిక భాషలలోనూ వాడబడుతూవుంది.

ఈ జబ్బు రావటానికి ఎన్నో కారణాలు దోహదం చేస్తాయని మాత్రమే ప్రస్తుతం వైద్య విజ్ఞానానికి తెలిసిన సంగతి. అసలైన కారణం నిక్కచ్చిగా చెప్పవచ్చును. ఈ రోగానికి వాడబడే మాత్రలు నిద్రని కలగజేయటం సహజమే! కాని వైద్యులు చెప్పిన విధంగా నిర్ణీత ప్రమాణంలో ఈ మాత్రలను వాడటంవల్ల ఏ మాత్రమూ ప్రమాదం లేదు!

ఈ జబ్బు వచ్చినప్పుడు ఎవ్వరూ లేకపోవటం కొంతవరకు ప్రమాదమే! ఎందుకంటే, స్పృహ తప్పే సమయాలలో, ఏవైనా ప్రమాదకరమైన వస్తువులపై పడటంవల్ల శారీరక ప్రమాదాలు ఏర్పడే అవకాశం ఉందిగనుక.



'మన వూరి కథ'లో జయప్రద, కృష్ణ



**సాయంకాలం నీరెండలో సూర్య కాంతికి మెరిసిపోతున్న 'సరళా భవన్' గేటు ముందు ఓ యువకుడు లోనికి వెళ్ళడంకోసం సంకోచిస్తూనే ధైర్యంచేసి ప్రవేశించాడు.**

ఆరడుగుల ఎత్తు, పచ్చని ఛాయతో మిసమిసలాడే ఒళ్ళు, ఎదుటి మనిషి లోతుల్ని చదివేస్తున్నవా అన్నట్లుండే కళ్ళు, నిటారైన ముక్కు, ప్రక్కకు దువ్విన క్రాపు — ఒక్కసారిచూస్తే చాలు ఆకర్షించే మూర్తి అతనిది. కాని, మాసి, నలిగిన బట్టల్లో అతడు మాసిపోయిన పాత నోటులా వున్నాడు.

బయట వరండాలో గాంభీర్యాన్ని ఓ మూల కట్టివేసినట్లుంది — ఆల్సేషన్ కుక్క. బిక్కు బిక్కుమంటూ దిక్కులుచూస్తూ నిలబడ్డాడతను. కుక్క లేచి నిలబడింది. దిక్కులు పిక్కటిల్లేట్లుగా అరవలేదు. అసలు అరవనేలేదు.

లోనికి ప్రవేశించడంకోసం అడ్డున్న కుక్క వైపు భయంగా చూస్తూ ద్వారంవైపు రెండడుగులు వేశాడు. పలుచని నీలిరంగు కర్టెన్‌లోంచి లీలగా కనిపించిందో స్త్రీ ఆకారం. మళ్లీ ఒక క్షణం సంకోచం. చివరకు గెలుపు తెగింపుదే!

మెల్లిగా కర్టెన్ తొలిగించాడు. 'మే ఐ కమిన్' అన్నట్లుగా దానికున్న చిరుగజ్జెలు మ్రోగాయి. 'కమిన్' అన్నట్లుగా రెండు అందమైన కాళ్ళు టీపాయ్ మీద ఊగాయి. ఆమె దృష్టి పుస్తకంలోంచి మరలలేదు. అతనక్కడే నిలబడివున్నాడు. ఆమె చేతిలోని ఇంగ్లీషు నవల అట్టవెనక వున్న విలన్ పిస్తోలు అతనివైపు గురిపెట్టి క్రూరంగా చూస్తున్నాడు. అతని భయాన్ని చూసేమో అన్నట్లు ముందు పేజీపైని దిగంబర యువతి విరగబడి నవ్వుతోంది. ఆమె దృష్టి ఎప్పుడు మరలుతుందా అని ఎదురుచూస్తున్నాడతను. ఆమెకు ఇరవైయేళ్ళుండవచ్చును. మామూలు శరీరఛాయ. మామూలుకు మించిన అందమైన అవయవాల పొందిక. సోఫాలోకి జారి నిర్లక్ష్యంగా కాళ్ళు టీపాయ్‌మీద పెట్టి చిన్నగా ఊపుతూ నవల చదవడంతో లీనమయింది.

ఒక క్షణం కరిగింది. ఓ పేజి తిరిగింది. కాని ఆమె దృష్టి తిరగలేదు!

పొడిగా దగ్గాడు, ఆమె వెంటనే చూడలేదు. కాసేపటి తరువాత కనులు త్రిప్పింది. "ఎవరు కావాలి?"

"నాకు... నేను రాజారావుగారి కోసం వచ్చానండి."

"నాన్నగారు కాసేపట్లో వస్తారు." మాటల్లో సౌజన్యతకన్న వ్యాపారసరళియే ఎక్కువ వినిపించింది.

ఆమె అతను కూర్చున్నాడా? లేదా? అని తిరిగిచూడలేదు. కాళ్ళను మాత్రం దించి పుస్తకంలోకి వెళ్ళిపోయింది. అతనో సోఫాలో కూర్చున్నాడు. నీలిరంగు బట్టమీద నల్ల పూసలున్న ఆ సోఫా కవరుపైనున్న తన తెల్ల పైజామా లాల్చీలపై మురికి మరకలు అసహ్యంగా కనిపిస్తున్నాయి. అతను తన పరిస్థితికి తానే సిగ్గుపడుతున్నట్లు అతని ముఖమే చెబుతున్నది. అతను తనపైనుండి దృష్టి మరల్చుకొని నలువైపులా చూస్తున్నాడు.

ఆమె పుస్తకం చదువుతూంది. అతను ఆమెను, ఆమె చుట్టువున్న వస్తువుల్ని చదువుతున్నాడు. అన్నీ ఎక్కడ వుంచవలసినవి అక్కడ అందంగా అమర్చబడి వున్నాయి. కాని అతనికి తానే అక్కడ వుండవలసినవానిగా కనుపించలేదు.

కాసేపటికి అతను యిబ్బందిగా కదిలాడు. ఆమె తప్పనిసరై అతనివైపు అసహనంగా చూసింది.

"మీ పరిచయం తెలుసుకోవచ్చా?" వీలైనంత సౌమ్యత కనబరిచాడు.

"సరళ." ఆమె చెప్పిన సరళి సరళంగా అనిపించలేదతనికి.

"ఏం చేస్తున్నారు?" తిరిగి ప్రశ్నించాడు.

"పుస్తకం చదువుతున్నాను." ఆమె ధోరణి ప్రశ్నను అర్థంచేసుకోనట్లు గాక, నీకు చెప్పాల్సిన అవసరం లేదన్నట్లుగా కనబడింది.

"మిమ్మల్ని ఇదివరకు ఎక్కడో చూసినట్లు గుర్తు."

"ఎక్కడైనా చూసివుండవచ్చు." సంభాషణ ముగించేయాలని నిర్లక్ష్యంగా అంది.

"ఎక్కడైనా కనబడుతుంటారా ?" వ్యంగ్యం తొంగిచూసిందతని గొంతులో.

"ఏ పనీలేని జులాయి వెధవల పని అది."

"ఐతే..."

ఆమె ముఖంలో కోపం ఎర్రరంగు దాల్చింది.

"మీరు వచ్చిన పని చేసుకుని వెళ్లడం మంచిది."

"వచ్చిన పని మరిచిపోలేదు." నవ్వుతూ అన్నాడు.

ఆమె అతడివైపు చూడలేదు.

"మేడమ్ ! గొంతు ఎండుకుపోతోంది. మంచినీళ్లు ఇవ్వగలరా ?"

"నేను నౌఖర్నికాదు." తలెత్తకుండానే అంది.

"ఇంటికి వచ్చిన అతిథికోసం ఆమాత్రం చేస్తే నౌఖర్లవుతారా ?"

"అతిథులెవరో, యాచకులెవరో నాకు బాగా తెలుసు."

"తనను బిచ్చగాడంటూవుంది." మనసులో అనుకున్నాడు.

"నిజమేనండీ ! కార్యార్థియై వచ్చినవాడు యాచకుడే అవుతాడు. సెలవండీ ! రాజారావుగారిని మరోసారి కలుస్తాను." తను వచ్చిన పని ఐపోయిందనిపించి, లేచి నిలబడ్డాడు.

ఇంతలో లోపలనుండి రాజారావు డ్రాయింగ్ రూమ్‌లోకి వస్తూనే గడియారంవైపు ఒకసారి చూసి ఆమెవైపు తృప్తిగా చూసాడు.

రాజారావును చూడగానే తొట్రుపాటుతో నమస్కరించాడా యువకుడు.

రాజారావు అతనివైపోసారి చూసి ప్రతి నమస్కారం చేయక, తలూపి కూర్చున్నాడు.

ఆతడు వినయంగా చేతులు కట్టుకుని "నా పేరు రవి. మీరు ఇంటర్వ్యూ చేసిన అభ్యర్థులలో నేనొక్కడిని..." అతని గొంతు వణికింది.

"ఇంకా సెలక్షన్స్ కాలేదు."

"అందుకే తమ దగ్గరకు వచ్చాను."

"ఇదివరకే నిర్ణయం జరిగిపోయింది. ఇప్పుడేమీ ప్రయోజనంలేదు." పెదవి విరుస్తూ అన్నాడు రాజారావు.

"సార్ ! నేను బి. ఏ. ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాను. ఇంటర్వ్యూకు వచ్చిన అభ్యర్థులలో నావే ఎక్కువ మార్కులు. నేను చాల బీదవాణ్ణి. నాకు న్యాయం చేకూర్చండి."

రాజారావు గలగల నవ్వాడు. "రాత్రింబవళ్ళు అనవసరంగా కష్టపడి చదివావు ! ఆ కష్టంతో డబ్బు సంపాదిస్తే యీ ఉద్యోగం దొరికేదేమో ! చూడు మిస్టర్ ! నువ్వు ఎలిజిబిల్ క్యాండిడేటువే కావచ్చుకాని లాభంలేదు. కనీసం మూడువేలైనా ముట్టచెప్పితే నీకోసం ప్రయత్నం చేయగలను."

'ఈ మూడువేలతో సరళ పెళ్లికి మరో షామియానో, విలువైన బ్యాండునో తెప్పించవచ్చు.' అనుకున్నాడు రాజారావు.

"సార్ ! న్యాయంగా నాకొచ్చే ఉద్యోగంకోసం

# ఇంటర్వ్యూ

నేను డబ్బివ్వడం అన్యాయం ! మేడమ్ మీరైనా చెప్పండి !" జాలిగా అన్నాడు.

ఆమె ముఖం తిప్పుకుంది. తిప్పుకుని తండ్రి వంక ముసిముసిగా నవ్వింది. నవ్వి, "ఈయనగారికి నేను మంచినీళ్ళు తెచ్చి ఇవ్వాలట ! నాయింట్లో పెళ్లికొడుకుల హోదాలో వచ్చేవారికే నౌకర్లు తెచ్చిస్తారు." కోపంగా అంది.

రాజారావులోని ప్రసన్నత కరిగిపోయింది. "నేను చెప్పాల్సింది చెప్పేశాను. మూడువేలు తేగలిగితేనే మరోసారి ఇక్కడికి రా ! వెళ్ళు." తాను లేస్తూ అన్నాడు.

"సార్..." రవి ఏదో అనబోయాడు.

"మిస్టర్ ! ఇప్పుడు మా అతిథులు వస్తారు. వారి ముందు నువ్వుండడం నాకిష్టంలేదు.

> ## నిరుద్యోగి చూపులు
>
> చూస్తాడు, ఎదురు చూస్తాడు నిరుద్యోగి
> న్యూస్‌పేపర్ కోసం
> అంతకన్నా ఆత్రంతో చూస్తాడు వాంటెడ్ కాలమ్స్
> కనపడ్డదానికల్లా చేస్తాడు అప్లై
> ఆశ చూపుతూ వస్తుంది ఇంటర్వ్యూ
> ఇంట్లోవారిని బాధపెట్టి సంపాదిస్తాడు
> నాలుగు డబ్బులు
> లేకపోతే చేస్తాడు స్నేహితుని దగ్గర అప్పులు
> ఆ ముహూర్తానికి వెళ్తాడు యథాప్రకారంగా
> తన పిలుపు కోసం కాస్తాడు పడిగాపులు
> ప్యూన్ కేక విని వెళ్తాడు నీరసంగా
> అడిగినదానికి చెప్తాడు ఉషారుగా
> ఇంటి మొఖం పడ్తాడు సంతృప్తిగా
> వింటాడు నాలుగు రోజులకి తోటి నిరుద్యోగి దగ్గర
> ఆ పోస్ట్కు రికమండేషన్ కాండిడేట్
> తన్నుకుపోయాడని
> పడతాడు నిరుత్సాహం ఎప్పటివలె
> విరక్తితో చూస్తాడు రేపటి న్యూస్‌పేపర్ కోసం.
>
> — తలశిల రామకృష్ణ

కాబట్టి యిక్కడనుండి వెంటనే వెళ్లిపో !" అసహనంగా అన్నాడు.

"వెళుతున్నాను సార్ ! కాని ఒక విషయం గుర్తుంచుకోండి. మేలు చేసినవాడికే మేలు జరుగుతుంది !" అని గిరుక్కున వెనక్కుతిరిగాడు.

అతను నిర్వికారంగా ఆ యిల్లును దాటి నడిచిపోతున్నాడు. అతని కళ్ళలో యిదివరకున్న దీనత్వం లేదు.

అతని కళ్లు ఇప్పుడు చురుక్కనేలా చూస్తున్నాయి. కాళ్ళిప్పుడు చురుగ్గా నడుస్తున్నాయి.

కొంతదూరం పోయాక ఓ టాక్సీని ఆపి ఎక్కి కూర్చున్నాడు. అది చిక్కుబడిన దారంలా వున్న ట్రాఫిక్‌లోంచి హోటల్ 'స్వాగత్' దిక్కు జారిపోతున్నది.

వెనకసీట్లో జారగిలబడి సిగరెట్ వెలిగించి ఆలోచిస్తున్నాడు — ఇంతవరకు రవిలా నటించిన వేణు. 'నేనెంత బాగా నటించాను. అవును. వేణు — పెళ్లికొడుకు హోదాలో వెళితే వాళ్ళ గుణగణాలను అంచనా వేయగలిగేవాడినేనా ? లేదు. రవి — నిరుద్యోగిగా వెళ్లి తెలుసుకున్న వారి మనస్తత్వంలో వెయ్యవవంతుకూడ తెలుసుకోలేక పోదును. ఈ విషయంలో నిజంగా రవి యిచ్చిన సలహాకు థాంక్సు ! నిజంగా యిది దైవఘటనే ! తాను రవి ఇద్దరు కలసి ఒకేసారి ఇక్కడకు రావడం, తాను పెళ్లిచూపులకు వెళుతున్న అమ్మాయి తండ్రి రాజారావుగారే రవికి ఇంటర్వ్యూ చేసిన ఆఫీసరు కావడం గమ్మత్తే !

అమ్మ బలవంతంమీద, 'వాళ్లకు నువ్వు టూర్‌లో ఆవూరికి వస్తున్నట్లు — అమ్మాయిని చూస్తాడని రాసాను. వెళ్లకపోతే బాగుండ'దని పట్టుబడితే వచ్చాడు. కాని తనకే అమ్మాయిని చూడటం యిష్టంలేదు. అందుకు కారణం లేకపోలేదు. అతనికి, తనకు కాబోయే జీవిత భాగస్వామినిని గూర్చి కొన్ని అభిప్రాయాలున్నాయి. ఆమె సౌజన్యమూర్తిగా, సున్నితమైన హృదయంతో, ఆప్యాయత, అనురాగాలు మూర్తీభవించిన స్త్రీమూర్తిగా వుండాలి. స్వశక్తితో ఒక వ్యక్తిగా నిలబడ్డ తనను, తన కుటుంబ సభ్యులను అభిమానించి, ప్రేమించే వ్యక్తి కావాలి. అలాంటి వ్యక్తిని పెళ్లిచూపుల మిషతో ఆ నాలుగైదు నిమిషాల్లో, ఎలా అంచనావేయాలి ?

నిజంగా ఉద్యోగంకోసం చేసే ఇంటర్వ్యూలు, పెళ్లిచూపుల నిమిత్తం జరిగే ఇంటర్వ్యూలు జరిగే నాలుగైదు నిముషాల్లో వ్యక్తియొక్క అసలు ప్రతిభ, గుణం తెలుస్తుందా ? లేదు. అలాంటప్పుడు యీ ఇంటర్వ్యూ లెందుకు ? లంచం డబ్బుతో ఉద్యోగాలు కొనడం, కట్నం డబ్బుతో వరులను కొనడం, అమ్ముడుపోవడం చాల నీచం.

"స్వాగత్ వచ్చేసింది సార్ !" అన్న టాక్సీ డ్రైవరు పిలుపుతో స్వగతంలోంచి ప్రస్తుతానికి వచ్చాడు వేణు. మీటర్ డబ్బు చెల్లించి రూమ్‌లోకి వెళ్లేసరికి రవి, వేణు కోసమే ఎదురు చూస్తున్నట్లు కూర్చున్నాడు.

"ఎలా జరిగింది ఇంటర్వ్యూ ?" ఆత్రంగా ప్రశ్నించాడు రవి.

జరిగిన సంగతి క్లుప్తంగా చెప్పాడు వేణు.

"నిజంగా నువ్వు గొప్ప నటుడివోయ్ ! కాలేజి నాటకాల్లో నాకు ప్రథమ బహుమతి, నీకు ద్వితీయ బహుమతి వచ్చింది గాని — ప్రథమ బహుమతి నీకు రావాల్సింది !" మెచ్చుకోలుగా అన్నాడు.

వేణు సన్నగా నవ్వి ఊరుకున్నాడు.

* * *

అక్కడ రాజారావుగారు అతని కూతురు డ్రాయింగ్ రూంలో కూర్చొని పెళ్లికొడుకు కొరకు ఎదురుచూస్తూ, 'పెళ్లికుమారున్ని ఎలా ట్రాప్ చేయాలి ? ఎన్ని షామియానాలు వేయించాలి ?' అని ఆలోచిస్తున్నారు. ●




లావణ్య పిక్చర్స

# ముగ్గురు మూర్ఖులు

దర్శకత్వం
కె. హేమాంబరధరరావు

రచయిత - నిర్మాత
మహేష్

ఆంధ్ర: విజయకంబైన్స్. సీడెడ్: జయలక్ష్మి పిక్చర్స్. నైజాం: గీతాఫిలింస్ (శ్రీ తారకరామా ద్వారా)



సీరియల్

# ఓ కవిత కథ

బి. వి. ఆర్. బాబు

"ఓకె. ఆ విషయంలో అవసరమైతే, నీతో చెప్పకుండానే, నేరుగా వచ్చేసేస్తాంలే. అప్పుడప్పుడు ఈ ఫ్రెండుని గుర్తుపెట్టుకొని ఉత్తరాలు రాస్తుంటావా? లేక నీ బిజీ డ్యూటీలోపడి నా సంగతేమర్చిపోతావా?"

"అరె, నీకెందుకోయ్ ఆ దిగులు. నా దగ్గర్నుంచి మాత్రం తప్పకుండా వారానికొకటన్నా ఉత్తరం వస్తుంది కానీ నీవే ఆ కవితగారి ధ్యాసలోపడి మమ్మల్ని మరచిపోతావేమో" అని తమాషాగా జోక్ చేస్తున్నవాడలా ఆగి. సీరియస్‌గా,

"బై—దీ—బై. అన్నట్టు మరో విషయం నువ్వు ఎప్పుడు ఏ ధ్యాసలో ఉన్నా చదువు మాత్రం అశ్రద్ధ చేయకు సుమా" అన్నాడు.

"నో. నో, అసలు నేను చదవకపోతే. ఊరికిపోతే కవితే నన్ను నెత్తిమీద మొడుతుంది. నీకేం. ఆ భయం అక్కరలేదులే"

ఆ మరుసటి రోజు ఉదయమే, రమేష్

*(గత సంచిక తరువాయి)*

వెళ్లిపోయాడు. సత్యం కూడా స్టేషన్‌కివెళ్ళి రైలెక్కించి మరీ వచ్చాడు.

సాయంత్రం నాలుగు గంటలయింది. ఆ రోజు తోడు ఎవ్వరూ లేకపోవడం వలన కవిత ఒక్కతే నీళ్ళకని వెళ్లింది. నీళ్ళు చేదుకొని వస్తున్నది. కట్టుకున్న ఎర్రచీర, అక్కడక్కడా తడిసి మరీ ఎర్రగా కనిపిస్తున్నది. చుట్టుపక్కల ఎవ్వరూ లేరు. ఇప్పుడు చేలల్లో కూడా పనులేవీ లేవు కాబోలు ఎవ్వరూ పొలాల్లో కనిపించడంలేదు. పొలాలన్నీ బోసిగా ఉన్నాయి. తల వంచుకొని నడుస్తున్న కవిత ఎదురుగా ఏదో చప్పుడు వినిపించడంతో తలెత్తి చూసింది. ఎదురుగా పరుగెత్తుకుంటూ వస్తున్నది ఒక ఆంబోతు. గబుక్కున ఒక కేక వేసింది. చేతిలో బిందె కిందపడిపోయింది. వెనుదిరిగి పరిగెత్తింది.

ఆమె పరుగెత్తడం చూసి, ఆ ఎర్రచీర చూసి మరీ బెదిరిపోయింది ఆ ఆంబోతు. ఆమెనే వెంబడించింది. దక్షిణంవైపు తిరిగి చేలల్లో అడ్డంగా పరుగెత్త సాగింది. అలా ఎంత దూరం పరుగెత్తిందో తనకే తెలియదు తరువాత తలెత్తి చూస్తే ఎదురుగా రైల్వే లైనుమీద ఒక ట్రైయిన్ ఆగివుంది. దానికి ప్రక్కనే వున్న పొలంలోంచి ఎవరో ఒక మనిషి నడిచి వస్తున్నాడు.

ఆమె వెనుదిరిగి చూసింది. ఇంకా, ఆ, ఆంబోతు దగ్గరగా వచ్చేసింది. అది గమనించాడా పెద్దమనిషి. అతను కవితను గుర్తుపట్టాడు. "అమ్మాయిగోర్లూ, ఆగండి. అదేం చెయ్యదు" అని అరిచాడతను. అయినా అతని మాటలు కవితకేవీ వినిపించలేదు. వెనుకాల తరుముకొని వస్తున్న ఆంబోతు మాత్రమే గుర్తుకు వస్తున్నది. గబుక్కున 13 నెం. రైలుపెట్టెలో ఎక్కేసింది. ఆ, ఆంబోతు రైలుపెట్టెదాకా వచ్చి ఆగిపోయింది.

ఇదంతా ఆ మనిషి చూస్తూనే ఉన్నాడు. అతను రంగంలోకి దిగి, ఆ ఆంబోతును దూరంగా తరిమేశాడు. ఈలోపలే రైలు కదిలింది. వేగం పుంజుకుంది.

అప్పటివరకూ వేరే ధ్యాసేలేని కవిత నిదానంగా ఊపిరి పీల్చుకొంటూ చుట్టూ చూసింది. తానొక రైలు పెట్టెలో ఉంది. అప్పటికే రైలు కదిలింది. ఎక్స్‌ప్రెస్ ఏమో వేగం పుంజుకుంది...

ఆమె ఎప్పుడూ వాళ్ళ ఊరు విడిచి రాలేదు. అలాంటిది ఈ రోజు హఠాత్తుగా ఎవ్వరూ తోడులేక, ఒంటరిగా రైల్లో ఎక్కడికని వెళ్తుంది.. ఆమె ఏడుపు బిగబట్టి అపుకుంది. మిగిలిన ప్రయాణీకులంతా ఎవరి ధోరణిలో వారున్నారు. పై బర్త్‌మీద నున్న ఒక సిల్కు లాల్చీ అతను మాత్రం ఆమెను గమనిస్తున్నాడు. రైలు ఏదో స్టేషనులో ఆగింది. తను దిగుదామా అనుకొంది. కానీ టిక్కెట్ లేకుండా స్టేషన్ బయటికి ఎలా వెళ్లడం? సరే, ఈ రైల్లో వాళ్లతోనే ఎవరో ఒకరితో పరిస్థితంతా చెపితే తనను యింటిదాకా చేర్చకపోరు కదా అనుకుంటూ అటూ ఇటూ చూసింది.

ఆమె ఆలోచన కనిపెట్టినట్లుగా ఆ సిల్కులాల్చీ వ్యక్తి ఆమెను దగ్గరగాపిలిచాడు. 'ఏమ్మా పొరపాటున రైలెక్కావా' ఆప్యాయత ధ్వనించిందాయన కంఠంలో.

# వో కవిత కథ

> *జరిగిన కథ : 2* రాఘవయ్య మాస్టారు కూతురు కవిత బాల వితంతువు. స్నేహితురాలు కవితను పెళ్లి చేసుకోవా లనుకుంటున్నానని మీ అభిప్రాయం చెప్పమనీ మాస్టారిని కోరతాడు సత్యం.

ఇందాకటినుంచీ ఆపుకున్న దుఃఖం కట్టలుతెంచుకొంది విషయమంతా అతనితో వివరించింది.

"పోన్లే అమ్మా మా ఊరు వెళదాం ప్రస్తుతం. అక్కడ్నుంచి బస్సులో వెళ్లవు గానిలే. మా అమ్మాయి కూడ నీతోపాటు వచ్చి నిన్ను దిగబెడుతుందిలే" అన్నాడతను. ఆప్యాయత ధ్వనించే కంఠంతో.

సగం బరువు దిగిపోయినట్లయింది కవితకు. రైలు చాలా సేపటికి హైదరాబాదు చేరింది.

"పదమ్మా మనింటికి వెళ్దాం" అంటూ లేచాడా వ్యక్తి. అతన్నే అనుసరించిందామె. టికెట్ కలెక్టరు దగ్గరికి వెళ్లి ఏదో చెప్పి అతని చేతిలో డబ్బులుంచి వాకిట్లోకి వచ్చాడతను. అతను వెనకాలే కవిత. ఇద్దరూ కలిసి ఒక జట్కా మాట్లాడుకొని అందులో ఎక్కి కూచున్నారు.

* * *

"మాస్టారుగారూ మాస్టారుగారూ" అంటూ ఆదుర్దాగా పిలిచాడు ఆ వ్యక్తి మనిషే కవితను రైల్లో ఎక్కడం చూసింది

'ఎవరూ!' అంటూ వచ్చారు రాఘవయ్యగారు.

'అయ్యగోరూ, శానా గోరం జరిగిపోనాదండీ మన అమ్మాయిగోరు లేరండీ..."

"ఎవరూ, కవితా" అనుమానంగా అడిగారు

"అదేనండీ కవితమ్మగోరు రైలెక్కేసినారండీ"

"ఏమిటీ, అసలు ఏం జరిగిందో చెప్పు" ఆదుర్దాగా అడిగారు రాఘవయ్యగారు.

జరిగిన విషయమంతా విన్న ఆయన కొద్దిసేపు అచేతనులైపోయారు. వెంటనే కవిత నీళ్లు తెచ్చే చోటికి బయలుదేరారు. దారిలోనే ఎదురైంది ఖాళీబిందె...దారిపక్క పొదల్లో పడిపోయి ఉంది ... చూస్తూనే బావురు మన్నారు రాఘవయ్యగారు.

అక్కడ ఉన్న వారంతా వెంటనే రాఘవయ్యగారిని ఇంటికి చేర్చారు.

* * *

జట్కాబండి ఒక యింటి ముందు ఆగింది. "రామ్మా కవితా. ఇదే మనిల్లు" అంటూ లోపలికి నడిచాడాయన. కవిత అనుసరించిందాయనను.

"కాంతం, ఒసే కాంతం" అంటూ గావుకేక పెట్టాడతను. అక్కడున్న కుర్చీలో కూర్చొంటూ.

ఆ కేక వింటూనే లోపలి గదుల్లోంచి నలుగురైదుగురు ఆడవాళ్లు తొంగిచూసి కవితను చూచి మళ్ళీ లోపలికి వెళ్ళారు. కొంచెంసేపు తరువాత లోపల్నుంచి ఒకావిడ వచ్చింది. నల్లగా లావుగా రుబ్బు రోలులా తుమ్మ మొద్దులా ఉంది.

"ఏమిటా గావు కేకలు. ఎందుకంత కొంప అంటుకుపోయేట్లు అరుస్తావ్. నీకే మన్నా బుద్ధుందా లేదా? ఎన్నిసార్లు చెప్పాలి అలా గావుకేక లెయ్యొద్దని" అంటూ రుస రుస లాడింది. తరువాత ఇటువైపు చూస్తూ "ఎవరీ అమ్మాయి" రహస్యంగా అడిగింది.

"అందుకే గదూ పిలిచింది. పాపం పొరబాటున రైల్లో ఎక్కింది. ఇంటికి వెళ్ళడానికి డబ్బుల్లేవు. చేతకాదు. అందుచేత మనింటికి తెచ్చాను. మనమ్మాయిని కూడ తోడిచ్చి పంపుదామని. పాపం పిచ్చిపిల్ల ఒంటరిగా పోలేదు గదా. అదిసరే, అమ్మాయికి భోజనం అదీ చూడు పో. పాపం ఎప్పుడు తిన్నదో ఏమో. అమ్మాయి జాగ్రత్త. నేనూ వెళ్లివస్తాను" అంటూ లేచి బయలుదేరాడు ఆయన. ఆమె కూడా లేచి అతని వెనుకనే వెళ్ళింది.

"ఒసేవ్. ముందొక నాలుగు రోజులు గుట్టుగా గడుపు. మొదట్లోనే పన్లోకి దింపితే కొత్తపిట్ట బెదిరిపోతుందేమో. కొంచెం జాగత్తగా వ్యవహరించు." మెల్లిగా ఆమె చెవిలో చెప్పాడతను.

"సరేలే, నాకు తెలియదూ ఆ సంగతి. నువ్వు వెళ్లిరా మరి నేను చూసుకొంటాను ఆ సంగతి"

"అయితే వెళ్లిరమ్మనడమేనా లేక ఏమన్నా ఉందా" అడిగాడతను కుడిచేతి చూపుడు



# ఆదా చేసుకోండి ఒక రూపాయి!







## సింథాల్ పౌడర్‌పై- మీరు సింథాల్ సబ్బును కొన్నప్పుడు *

కూపన్ ప్రకటనతోకూడిన సింథాల్ సబ్బును కొనండి. ఆ సబ్బు యొక్క ప్రతి రేపర్ వెనుక ఒక కూపన్ ఉంటుంది. ఆ కూపన్ మీ డీలర్‌కు అందించి సింథాల్ టాయిలెట్ పౌడర్‌పై(ఏ సైజుదైనా సరే) ఒక రూపాయి తగ్గింపును అందుకోండి.







*స్టాకులు వున్నంతవరకే మరి ఈ సదుపాయం!

Interpub/GS/13/75 TL

## వో కవిత కథ

వేలును బొటనవ్రేలుతో ఎగరవేస్తూ.

"నీకప్పుడే ఏం తొందర. తరువాతివ్వనూ. అమ్మాయినిప్పుడు తీసుకొచ్చావో లేదో అప్పుడే డబ్బులని తగలడుతుంటావు. ఇంద తీసుకో" అంటూ బొడ్లోంచి పదిరూపాయల నోట్లను తీసి లెక్కపెట్టి ఐదు ఇచ్చింది అతని చేతికి.

"ఏవిటీ, ఇదేనా, ఆ అమ్మాయిమీద నువ్వు వేలు గడిస్తూ వెధవ ముష్టి యాభై నాకివ్వడం. మహో ఏభై కూడా పడేయ్"

"సగేలే తీసుకొని చావు" అంటూ ఇంకో ఐదు నోట్లను అతని చేతిలో ఉంచింది.

"సరేలే వస్తాను. అమ్మాయి జాగ్రత్త" అంటూ వెళ్ళిపోయాడు. ఆమె మళ్ళీ లోపలకు వెళ్ళిపోయింది. అప్పటివరకూ కవిత ఒక్కతే నిలబడి ఉంది.

"అయ్యో కూర్చోక పోయావవమ్మా, రామ్మా, స్నానంచేసి భోజనం చేద్దువుగాని" అంటూ లోపలికి తీసుకెళ్ళింది.

ఆ రాత్రి ఎవరెవరో వచ్చారు కాని కవిత మాత్రం ఒక విడిగదిలో ఉంది. భోజనంచేసి రూములోకి వెళ్ళి పడుకొన్నాక ఆమెవద్దకెవరూ రాలేదు. రాత్రంతా ఏదో గాజుల గలగలలు గుసగుసలు వినిపిస్తూనే ఉన్నాయి. అవేమిటో ఆ రాత్రి అర్థం కాకపోయినా, ఆ మరుసటి రోజే అర్థమైపోయింది అదొక వేశ్యా గృహమని.

* * *

ఆ తరువాత మూడోరోజు ఆ సిల్కులాల్చీ వ్యక్తి హుటాహుటిన వచ్చాడు వస్తూనే "ఒసేవ్ కాంతం" అంటూ గావుకేక పెట్టాడు. అతని చేతిలో ఆ రోజు న్యూస్ పేపరుంది.

"ఏమిటే, మళ్ళీ ఏమొచ్చింది" అంటూ అంతమాత్రం గావుకేక తనూ పెట్టింది ఆకాంతం. "ఇలా త్వరగా రా, ఒక్కసారి మళ్ళీ పోదువు గాని"

ఆమె నిదానంగా తన భారి కాయాన్ని మోసుకుంటూ వచ్చింది. "ఏమిటట. ఎందుకంత గావుకేక లెడుతున్నావ్. తిన్నది అరగలా" అంటూ అక్కడున్న సోఫాలో కూర్చుంది. సోఫా కిర్రుమని శబ్దం చేసింది.

చేతిలోని న్యూస్ పేపరు ఆమెకు అందించాడు అతను.

"ఏమిటీ భాగోతం. అదేదో చెప్పి ఏడవకూడదూ. నాకు అక్షరంముక్క రాదని తెలుసు గదా? మళ్ళీ పేపరు నా చేతులకిస్తావేంటి? ఉన్మాదమా? చాదస్తమా?" కొంచెం కోపంగానే అడిగిందామె.

"నా ఖర్మకొద్దీ దొరికావు గదా!" విసుక్కున్నాడు సిల్కులాల్చీ 'ఇదుగో. ఈ పేపరులో ఆ అమ్మాయి ఫోటో వేసి ఉంది. ఈ పేపరుగాని ఆ అమ్మాయిని చూడనిచ్చేవు. మన కొంప మునిగిపోతుంది. జాగ్రత్తగా ఉండు. మరో రెండు రోజులదాకా ఓపికపట్టు. అప్పుడే ఆ అమ్మాయిని తొందర పెట్టకు. నిదానంగా నచ్చచెప్పడానికి ప్రయత్నించు. మరి నేను వెళ్తున్నాను. మరి...డబ్బులేమయినా వున్నాయా"

"ఊఁ, మరీ నీది చోద్యం. ఇప్పుడు డబ్బులు లేవు. ఏమీ లేవు. వెళ్ళిరా తరువాత చూద్దాం." కసిరిందామె కూడా కుర్చీలోంచి లేస్తూ.

* * *

మరో నాలుగు రోజులు గడిచిపోయినాయి, కవిత మౌనంగా తన గదిలో కూర్చొని ఆలోచిస్తోంది. ఎలాంటి తను ఎలాంటి స్థితికి రావలసివచ్చింది. భగవంతుడి దయవల్ల ఇంతవరకూ ఏమీ జరగలేదు, కానీ ఇక్కడ తను ఇలా ఎన్ని రోజులు? అవతల నాన్నగారెలా వున్నారో? పిన్ని ఏమనుకొంటున్నదో? ఊళ్ళో అలివేణి, పక్కింటి సుజాత, రావమ్మత్తగారి కోడలు సుభద్ర, మిగిలిన వాళ్ళంతా ఏమనుకొంటున్నారో? తను ఇక్కడికి వచ్చానని తెలిస్తే అసలు మళ్ళీ తనవైపు చూస్తారా వీళ్ళెవరైనా? ఊళ్ళో నాన్నగారి పరువు ప్రతిష్టలు ఏం కావాలి? ఇలాంటి స్థితిలో తను పవిత్రంగా ఉన్నానంటే. ఎవరైనా అందునా సత్యం నమ్ముతాడా?

ఇంతలో ఆలోచనలు సత్యం వైపు మళ్ళినాయి. ఎంత ఉదార హృదయుడు కాకపోతే తనను పెళ్ళిచేసుకోవడానికి ముందుకు వస్తున్నాడు సత్యం? అ ఆలోచనతో ఆమె మన

## యువతరం

'ప్రజల జీవితాలతో ఆడుకునేవారికి తప్ప ముక్కుకి సూటిగా పోయేవారికి రాజకీయాలు పనికిరావు' ఇది జి.వి. శ్యామ్‌సుధీర్ అనుభవపూర్వకంగా తెలుసుకున్న విషయంట. జై ఆంధ్రా వుద్యమంలో పాల్గొన్నాడు.

గుంటూరు ఎ. సి. కాలేజీలో బి. ఎ. చదువుతున్న ఇతడు ఇంటర్మీడియట్‌లో డిస్టింక్షన్ సంపాదించాడు. భారతీయ విద్యా భవన్ (గుంటూరు), అఖిలభారత విద్యార్థి పరిషత్తు, గుంటూరు జే.సీ.క్లబ్, రోటరీక్లబ్ విజయవాడ సోషియల్ అండ్ లిటరసీ క్లబ్, రాష్ట్ర కమ్యూనిష్టు పార్టీ ఇంకావివిధకళాశాలలునిర్వహించినతెలుగు ఇంగ్లీషు వ్యాసరచన మరియు వక్తృత్వపు పోటీలలో ఎన్నో బహుమతులు సంపాదించటమేకాక ప్రపంచ తెలుగు మహాసభలకు గుంటూరుజిల్లా ప్రతినిధిగా పాల్గొని తెలుగు వక్తృత్వపుపోటీలో ద్వితీయ స్థానం సంపాదించి సన్మానింపబడ్డాడు.



ఇంగ్లీషు, హిందీ సినిమాలు చూస్తాడు. మన తెలుగు సినిమాలు 'మాస్' కి నచ్చేలా అసభ్యకర సన్నివేశాలు, ద్వంద్వార్థపు మాట పాటలతో వుంటున్నాయి అన్నాడు.

వాళ్ళ కాలేజీలో విశాలమైన ప్లే గ్రవుండ్ వుంది. షటిల్, టేబిల్ టెన్నిస్ ఆడతాడు. "హాబీలమాటంటారా?—పుస్తకాలు చదవడం, సినిమాలు చూడటం, అమ్మాయిలతో సరదాగా ఖబుర్లాడటం, ఫొటోగ్రఫీలు" అంటున్నాడు.

మనదేశంలో ధరలు పెరగటానికి కారణం ప్రజలే. ధరలు పెరిగినప్పుడు సణుగుతూ అయినా ఆ వస్తువుల్ని కొంటారే తప్ప మానరు. ధరలు పెరిగినప్పుడు అందరూ ఆ వస్తువుల్ని కొనటం మానేస్తే ధరలు ఎందుకు తగ్గవు అని ప్రశ్నిస్తున్నాడు.

విద్యార్థులంతా గోధుమను ఆహారంగా తీసుకోవాలి. ఇది వరి ఆహారంకన్నా తేలిక అవటంవల్ల క్లాసురూముల్లో నిద్రపోయే అవకాశం వుండదు అంటున్నాడు.

ఇతనికి తనపేరు పేపర్లో పడాలనుంటుంది.

అమ్మాయిల్ని ఏడిపించినంత మాత్రాన తప్పులేదు. కాని వారిపై విసిరే కామెంట్లు వాళ్ళని నవ్వించేట్లుగా వుండాలిగాని బాధపెట్టేట్లుగా వుండకూడదు. అసలు అమ్మాయిలు కూడా అలాంటి కామెంట్ల కోసమే ఎదురు చూస్తుంటారు అనుకొంటున్నాడు.

# పండ్లవలె తాజాయైన

# స్పెన్సర్స

## స్క్వాష్‌లు, సిరప్‌లు

రుచి, స్వచ్ఛతతో కూడిన పండ్ల రసాలు. అందింపజేసుకొనేగా పేరుగడించిన స్పెన్సర్స్‌వారు.

ఆస్వాదించేప్పుడల్లా ఆహ్లాదంతోపాటు ఆరోగ్యాన్ని చేకూరుస్తాయి ఎన్నుకొనేందుకు ఎన్నో రకాలు, రుచులు.




FDS SP 2167 TEL

శ్రేష్ఠమైనవానినే చేకూర్చువారు **స్పెన్సర్స్**

స్పెన్సర్ & కం, లిడ్., మద్రాసు మరియు శాఖలు

సంతా ఏవో గిలిగింతలు పెట్టినట్లయింది.

ఇంతలో కాంతమ్మ వచ్చి చేరింది. ఈ వారం రోజుల్నుంచీ రోజూ వస్తూ ఉన్నది. తప్పనిసరిగా కవిత వింటూనే ఉన్నది. కవిత ఎదిరించక పోవటాన్ని చూసి ఆమె సంతో షిస్తున్నది. కాని కవిత ఉద్దేశ్యం వేరు. తను ఇక్కడనుండి బయట పడడానికి మార్గం చూసుకొనే దాకా వీళ్లతో మంచిగా ఉండాలి. ఎదురు తిరిగితే గదిలో ఉంచి తలుపులు బందించెయ్యగలరు.

రోజులాగే ఏవో నీతిబోధచేసి, ఆఖర్న లేస్తూ 'అయితే తహశీల్దారు గారబ్బాయి ఈ





# వో కవిత కథ

రోజు వస్తానన్నాడు. జాగ్రత్త. నీ అదృష్టం కొద్దీ దొరికాడు. ఎలా చూసుకుంటావో ఏమో. నీ ఇష్టం" అంటూ మరో మాట మాట్లాడడానికి అవకాశం లేకుండా వెళ్లి పోయింది. బేలగా చూసింది కవిత. కళ్లల్లో నీళ్లు సుళ్లు తిరుగుతున్నయ్. లాభంలేదు. తను ఇన్నాళ్లూ దాచుకొన్న పవిత్ర శీలం మట్టిపాలు గావలసిందేనా? హే భగవాన్! కుప్పలా కూలిపోయి కుమిలి కుమిలి ఏడ్చింది.

రాత్రి ఎనిమిది గంటలయింది. ఎలా తప్పించుకోవడం అని ఆలోచిస్తూనే ఉంది కానీ అందుకు మార్గం వెదకాలనే ఆలోచన తట్టలేదు. తలుపు తెరుచుకుంది. కాంతం ఒక యువకుడ్ని వెంట బెట్టుక వచ్చింది.

"చూడు బాబూ, మనిషి మాత్రం నలగని పువ్వు. ఎలా మంచి చేసుకొంటావో నీ యిష్టం..."

"ఒకవేళ ఒప్పుకోకపోతే..." ఏదో సైగ చేశాడు అతను.

"సరే, నీ యిష్టం" లయిష్టంగా తల ఊపింది కాంతం.

"అమ్మాయ్ కవితా, ఇతనేనమ్మా నేను చెప్పిన తాసిల్దారు కొడుకు. నేను వెళ్తున్నా" అంటూనే వెళ్లిపోయింది.

అతను తలుపు గడియ వేసి వచ్చాడు. తాగివచ్చినట్లున్నాడు, కళ్లు ఎర్రగా ఉన్నాయి. అతను నిశితంగా కవితవైపు చూశాడు. కవితకు గుండె ఝల్లుమంది. గదిలో ఇంకె వరూ లేరు. తామిద్దరే. అతనిప్పుడేంచేసినా ఆదుకొనే దిక్కులేదు. భయం భయంగా అతని వైపుకు చూస్తున్నది. అతను నిదానంగా ఒక్కొక్క అడుగే దగ్గరకు వేస్తున్నాడు.

'ఇంకా అలానే నిల్చున్నావేం?' కర్కశంగా ఉందా గొంతు. మాటాడలేదు కవిత భయం భయంగా అతని వైపే చూస్తున్నది. ఏ మాత్రం హృదయమున్న మనిషయినా ఆ చూపు చూస్తే ఆమెని వదిలిపెట్టే ఉండురు. అంత దీనంగా ఉంది ఆ చూపు

'లే. డబ్బులిచ్చి వచ్చింది ఊరికే చూసిపోవ డానికి గాదు' పిడుగు పడినట్లుగా మళ్లీ ఉరిమింది ఆ కంఠమే. అప్పటికీ కదలలేదు కవిత.

'ఏ సంగతి అంతా కాంతం నాకు చెప్పింది. మర్యాదగా లేవకపోతే బలవంతంగానైనా సరే నిన్ననుభవించి తీర్తానీరోజు" కవితలో చలనం వచ్చింది భోరున ఏడుస్తూ అతని కాళ్లపై పడిపోయింది. కాని ఆడితప్పని హరిశ్చంద్రుడి లాగా అన్నమాట నిలబెట్టుకున్నాడు ఘనుడు.

> ## రాలిన ముత్యాలు
>
> ……శ్రీ సోమసుందర్……
>
> ఉత్తమజాతి అశ్వానికీ
> ఉత్తమ కవిత్వానికీ
> ఎన్నో పోలికలున్నాయి;
> రెండింటికీ గతీ మతీ
> ప్రధాన ప్రాణ లక్షణాలు

ఎప్పుడో రాత్రి మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి చుట్టూ చూసింది ఏమీ మార్పు కనిపించలేదు. తనవైపు చూసుకొంది. ఒంటి మీద గుడ్డలన్నీ చినిగిపోయి ఉన్నాయి. జరిగిన దంతా ఒకసారి కలలాగా గుర్తుకు వచ్చింది. తనమీద తనకే అసహ్యం వేరుకు పోలోంది. స. తను ఇంకా ఎందుకు బ్రతకటం? స్త్రీకి ఏదైతే ప్రాణంలో సమానమో ఆ శీలాన్ని ఒక రాక్షసుడు ఈరోజు అపహరించాడు. రేపటి నుండి ఈ శరీరాన్ని ఎంతమంది వినియో గించు కొంటారో? తలచుకొంటేనే వళ్ళు వళ్ళంతా గగుర్పొడిచింది. ఈ ఘోరం తను భరించలేదు. తను బతుకడానికి వీల్లేదు.

ఒక స్థిర నిశ్చయానికి వచ్చినదాన్లా లేచింది. లేచి ఒళ్లంతా శుభ్రపరచుకొంది. చీరెంతా చినిగిపోయి ఉంది. చీర తీసిపారవేసి వేరే చీర కట్టుకుంది. నిదానంగా వెలుపలికి వచ్చి చూసింది. హాలులో కాంతం మాత్రం కుర్చీలో కూర్చొని తూగుతున్నది. వాకిట్లో కూచొనుంది. కాపలా ఉండే జోగులు ఎక్క డికో టీ తాగడానికి కాబోలు వెళ్లినట్లున్నాడు ఇదే మంచి సమయం.

గదిలోంచి మెల్లగా బయటకు వచ్చింది. వాకిలి దాటింది. గాజులు గల గల శబ్దం చేశాయి. అప్రయత్నంగా మెలకువ వచ్చి చూసింది కాంతం. ఎవరో చీరకట్టుకుని పోతున్నారు. ఎందుకో అనుమానం వచ్చింది. "ఎవరదీ" గట్టిగా కేకవేసింది.

కళ్ళల్లోంచి వణుకు పుట్టుకు వస్తున్నది కవితకు. వాకిలి దాటింది. పరుగెత్తసాగింది. కొంతదూరం పరుగెత్తి వెనుదిరిగి చూసింది.



# కళ్లజోడు లేకుండ మీరు కంటి చూపు పొందగలరు!



మీకు ఇంతకన్న ఎక్కువ ఆనందాన్నిచ్చేవార్త మరొకటి ఉంటుందా!

## 'కాంటాక్ట్ లెన్స్'లను వాడండి

ఈ 'కాంటాక్ట్ లెన్స్'లు హ్రస్వదృష్టి, దూరదృష్టి మరియు అఫాకిక్ (కాటరాక్టు ఆపరేషను పిమ్మట), కెరాటోకోనస్, అనిసోమెట్రోపియా, అనిసికోనియా, పాలియోపియా మొదలైన దృష్టిదోషములు కలవారికి ఉత్తమమైనవి.

'కాంటాక్ట్ లెన్స్'లను మీ కంటి పాపలకు మీకుమీరే అతిసులభంగా పెట్టుకొనవచ్చును •• తీసివేసికొనవచ్చును - కొద్దిదినముల అభ్యాసంతో. మీ కళ్లకు పెట్టుకొన్న ఈచిన్న 'కాంటాక్ట్ లెన్స్'లు ఇతరులకు అగుపించవు. కనుక మీ సుందర ముఖంలో ఎట్టిమార్పును వుండదు.

మీ కంటి వైద్యుని సంప్రదించండి

ఇతర వివరములకు : **ఆసియా కాంటాక్ట్ లెన్స్ లేబొరేటరీ**
**4/1, ఆండర్సన్ రోడ్,**
**మద్రాసు - 600 006**

ఫోన్ **87865**

లతకు
ప్రీతిపొంగిపొరలే నురగ



దీపకు
కావాలి పరిశుభ్రమైన బట్టలు








# రమ్య ఇద్దరికీ సంతృప్తినిస్తుంది






SAA/UPL/2120 TEL

విశిష్టమైన ఉత్పత్తి అల్ట్రామెరైన్ & పిగ్మెంట్స్ లిమిటెడ్, రాణిపేట, తమిళనాడు  అమ్మకము ప్యారీ & కో లిమిటెడ్

దూరంగా జోగులు కాబోలు పరుగెత్తుకు వస్తున్నాడు ఇహ లాభంలేదు లేచి మళ్లీ పరుగెత్తింది. మధ్య మధ్యలో వెనక్కి తిరిగి చూస్తుంది. దూరంగా జోగులు వస్తున్నాడు.

ఎదురుగా చూసింది ఏదో రోడ్డు

## వో కవిత కథ

ఆ గొందెలోంచి ఆరోడ్డు ఎక్కింది. పక్కకు చూ .ది. ఏదో కారు కాబోలు దగ్గరికి వ స్తుంది. ప్రక్కకు తప్పుకుందాం అను కొంది. ఇంతలోనే కారు వచ్చి ఆమెను ఢుద్దు పెట్టుకొంది. ఆమె పడిపోయింది.

* * *

నెమ్మదిగా కళ్ళు తెరిచి చూసింది కవిత. ఎదురుగా ఎవరో ఒక యువతి, ఒక యువ



"రేట్లు బాగా తగ్గేదాకా కొత్త ఫర్నిచరు కొనేదిలేదు అంటున్నారు మేనేజరుగారు!"

కుడు తెల్లని బట్టల్లో ఉన్నారు. ఆయువకుడి మెడలో మాత్రం స్టెతస్కోపుంది. దాన్ని చూడగానే అతనొక డాక్టరనీ, ఆమె ఒక నర్సనీ, ఇట్టే గ్రహించేసింది. చుట్టూ చూసింది. చాలమంది బెడ్‌లమీద పడుకొని ఉన్నారు.

తనెక్కడ ఉన్నది పరిశీలనగా చూసింది. అవును తనొక హాస్పిటల్‌లో ఉన్నది. అవును తనిక్కడికెలా వచ్చింది, తను కాంతం దగ్గర కదా ఉన్నది. తరువాత జరిగినదంతా గుర్తొచ్చింది. అక్కడినుంచి తప్పించుకు రావడం జోగులు తరుముకొని రావడం తరువాత ... తరువాత ? ఆఁ, తననోకారు కాబోలు డాష్ ఇచ్చింది. అంతే తరువాత తనకేం గుర్తు లేదు. భారంగా కణతలు నొక్కుకుంది. మళ్ళీ కళ్ళు తెరిచింది ఇప్పుడు సంతృప్తి వాళ్ల మొహాల్లో చిందులేస్తూంది.

'సిస్టర్! ఆమెనిప్పుడేమీ కదిలించ వద్దు ఆమెకు గ్లూకోజ్ వాటర్ మాత్రమివ్వు. ఆమె కిప్పుడు పూర్తి విశ్రాంతి కావాలి' అంటూ ఆమెకు ఇంకేదో సూచన లిచ్చి వెళ్ళిపోయాడు డాక్టరు.

అంతా అగమ్య గోచరంగా ఉంది కవితకు. తను ఎలా వచ్చింది ఇక్కడికి తను ఏదో ఒక కారుకింద పడింది. తరువాత వాళ్ళు వచ్చి ఈ హాస్పటల్లో జాయిన్‌చేసి ఉంటారు.

జరిగిందంతా తల్చుకొంటేనే ఆమెకు దుఃఖం ఉప్పెనలా ముంచుకు వచ్చింది. తన నెందుకు బతికించారు ? తను ఆ కారు కిందనె చనిపోతే ఎంత బాగుండేది ? ఇప్పుడయినా ఊరికి వెళ్ళిపోతే! అవును వీళ్ళ ద్వారా వెళ్ళిపోవచ్చు.

కాని ఆ రాత్రి జరిగిన సంఘటన తలచుకొంటేనే భయం వేస్తున్నది. రేపేదన్నా కడుపో కాలో వస్తే ఊళ్ళో ఎలా మొహం చూపించడం. జరిగిన పరిస్థితి ఇది అని, ఇందులో తన తప్పు లేదని చెప్పినా ఎవరైనా నమ్ముతారా ? ఆ పైన యిక ఆలోచించలేక గుట్టిగా కళ్ళు మూసుకుంది. ఇంత సేపట్నుంచి కంటిలో నిల్చిఉన్న రెండు నీటి బొట్లు, ఇప్పుడు చెంపల మీదుగా క్రిందికి జారాయ్.

"చూడండి, మీరు అలా ఆలోచించ కూడదు అంతగా ఆలోచించిన మీరు లేవ కోవడం కష్టం తరువాత డాక్టరుగారు మమ్మల్ని కేకలేస్తారు. ప్లీజ్! మీరేమీ ఆలోచించకుండా విశ్రాంతిగా పడుకోండి." నర్సు కంఠంలో అభ్యర్థనా తొంగి చూచింది.

( ఇంకా ఉంది )

గురూ ఆయనో. మనవాళ్లందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు చెప్పి ఈ నాటకాన్నే సినిమాగా తీస్తున్నారు. సినిమా డైలాగులుకూడా నేనే రాయాలిట. 'వెంటనే మొదలెట్టాలి సినిమా. మీరు ఒప్పుకుని తీరాలి' అంటున్నారు ప్రొడ్యూసరుగారు. బహుశా వచ్చేనెలంతా సినిమా కథాకారుల కార్యక్రమంలో గడిచిపోతుంది. వీలు చూసుకుని వచ్చి, మీ అందరికీ కృతజ్ఞతలు మళ్లీ స్వయంగా చెప్పుకుంటా "అన్నాడు" అంటూ బాధగా ముగించాడు రాధాగారు.

## జెలసీ

(16వ పేజీ తరువాయి)

చెప్పటం ఉడిగిన శ్రోతలు అయోమయంగా ఒకరి ముఖాలొకరు చూసుకుని, దుఃఖ భారంతో నావైపు తిరిగారు.

గోడకి జార్లబడి, తల వెనక్కివాల్చి, తదేకంగా పైకి చూస్తూ, చలనంలేకుండా కూర్చుని వున్నాన్నేను.

ఏదో కీడు శంకించిన నా ప్రియశిష్యుడు సింగు నాచేతిమీద చెయ్యేసి, కదిపాడు.

"ఏంటి గురూ! మరీ యింత యిదై పోతే ఎలా? బాధపడకండి" అన్నాడు.

ఒక వేడి నిట్టూర్పు విడిచి, అందర్నీ ఒకసారి చూసి, "ఓ మాంచి కథకి ఆలోచన వచ్చింది" అన్నాను.

ఆశ్చర్యపోయారందరూ.

"క థా ...... ?!"

"నువ్వు కథ రాయటమా...?!"

"ఈ సమయంలో కథకి ఆలోచనా...?!"

"ఏం కథ...?!" — ఈ మాటలకి జవాబుగా "జెలసీ" అన్నాను ముక్తసరిగా.



మ విగిర్చి ముందులాగే ప్రజాసేవ చేయాలని ఆశిద్దాం.

సెక్స్ సాహిత్యం

నేడు యువకులు, యువతులు సెక్సు మనో వైకల్యాలకు గురవుతున్నారని, దానికి కారణం

## హైదరాబాద్ నోట్ బుక్

(18వ పేజీ తరువాయి)

సెక్సు సాహిత్యం, పాశ్చాత్య దేశాలలోని విపరీత కామవాంఛల ప్రచారం, మత్తుమందులు, గర్భ నిరోధక ఔషధాలు, తలిదండ్రుల అదుపు లేకపోవడం మొదలైనవని నగరంలోని మానసి[illegible] వ్యాధుల వైద్యాలయం సూపరింటెండెంటు డాక్టర్ జి. నీలకంఠ రాజ్ యాదవ్ వివరం[illegible] ప్రకటించారు జాతి నిర్వీర్యమూ, అపమార్గ పన్న[illegible] త్తమూ కాకుండా చూడడం పెద్ద విధి. ఏంచేస్తారో చూడాలి

## హైదరాబాద్ నోట్‌బుక్

### "గరీబోళ్ల డాక్టర్" కాలధర్మం

ఎప్పుడో సియాల్‌కోట్‌లో జన్మించి, దేశ విభజన వల్ల అష్టకష్టాలు పడి, ఎలాగో ఢిల్లీ చేరుకుని, 1948 లో హైదరాబాదుకు వచ్చి స్థిరపడి పోయి, "గరీబోళ్ల డాక్టర్" అని ఖితాబు పొందిన డాక్టర్ సత్యపాల్ తుల్ జీవితం ధన్యమైంది. ఆదర్శప్రాయమయింది.

ఆయనకు కొంతకాలంగా కండరాల కేన్సర్ తగిలి మృత్యువువాత పడవేసింది. మే 20 వ తేదీ రాత్రి మరణించారు. అంత్యక్రియలు 21 ఉదయం జరిగాయి. వందలాది ప్రజలు ఆయనను అంబర్‌పేట శ్మశానవాటిక వరకు అనుగమించారు. శ్రీ ఉద్ధరాజు రామం చితికి నిప్పంటించారు. తమ్మారెడ్డి సత్యనారాయణ, శ్రీ భోజిరెడ్డి, డాక్టర్ ఎ. పి. విటల్ మొదలైన వారు డాక్టర్ తుల్ గుణగణ సంకీర్తనం చేశారు. డాక్టర్ తుల్‌కి మొదటి నుండి చివరివరకు శ్రీ చిర్రావూరి లక్ష్మీనరసయ్య, ఆయన పరివారం అండదండలుగా ఉన్నారు.

### నగరంలో శిల్పారామం

సుప్రసిద్ధ చిత్రకారుడు, శిల్పి, ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడెమీ కార్యదర్శి శ్రీపాకాల తిరుమల్‌రెడ్డి హైదరాబాద్ నగరంలో 50 లక్షల రూపాయల వ్యయంతో అపూర్వ శిల్పారామం నెలకొల్పడానికి సంకల్పించడం, తెలుగుజాతి త్యాగశీలతకు, భావుకతా పరాకాష్ఠకు నిదర్శనం. మలకపేటలోని ముఫఖంజా కళాశాలకు అనుకొని శ్రీ రెడ్డికి ఐదెకరాల తోట ఉన్నది ఇది దాదాపు ఐదులక్షల రూపాయల విలువ చేస్తుంది. దీనిని ఆయన కళా భారతికి అంకితం చేయదలచారు. దీంతో శిల్పారామం నెలకొల్పాలని ఒక పథకం సిద్ధపరచి, హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషనుకు, తదితర సంస్థలకు అందజేశారు. ఈ ఆరామంలో అవార్డు పొందిన శిల్పకళాఖండాల, ప్రతికృతులతో అలంకృతమవుతుంది. శిల్పకళా సాధనా పరిశోధనకై ఒక సంస్థను, శిల్పులకోసం 12 కుటీరాలు నిర్మిస్తారు. విదేశాలనుంచి వచ్చే శిల్పులకు తగు ఏర్పాట్లుంటాయి. శ్రీ రెడ్డి 40 సంవత్సరాలుగా గండరించిన శిల్పాలు దీనిలో ప్రదర్శితమవుతాయి. ప్రపంచ విజ్ఞాన సమితి మొదలైన సంస్థల సహాయంతో ఈ శిల్పారామం 1978 నాటికి రూపు తీర్చుకుంటుందని శ్రీ రెడ్డి విశ్వాసం. ఈ సత్కార్యానికి కళాప్రియులందరూ చేయూత ఇస్తారని నా విశ్వాసం.

### జంట నగరాలకు కొత్త రూపం

కాకతీయ, బహమనీ, కుతుబ్‌షాహీ, ఆసఫ్‌జాహీ వంశాల పాలనతో సహస్రాబ్దాలుగా వివిధ సంస్కృతుల సౌరభాన్ని సంతరించుకొని, నేటికీ సామరస్యానికి పేరుపొందిన జంటనగరాలను ప్రాచీన వైభవం చెక్కు చెదరకుండా సుందరతరం చేయడానికి నగరాభివృద్ధి సంస్థ బృహత్పథకం సిద్ధపరచింది. జంటనగరాలచుట్టూ 24 కిలోమీటర్ల ప్రాంతాన్ని ప్రాచీనతను పాడు చేయకుండా, విలాసయాత్రికులను ఆకర్షించే విధంగా పునర్నిర్మాణం చేస్తారు. ఈ 24 కిలోమీటర్ల ప్రాంతంలో గోల్కొండ, భాగ్యనగర్ గోషామహల్, హైదరాబాద్ పట్టణాలు వెలిశాయి కనుక, అప్పటికోటలు, దేవిడీలు, ప్రాసాదాలు, వీధులు, విపణులు ఇంకా ఉన్నాయి. ముఖ్యంగా చార్‌మినార్ చుట్టూ ఒక కిలోమీటరుమేర వాహనాల రాకపోకలు తొలగించడం, పూర్వం అంతర్జాతీయ విపణిగా ఉన్న కారవాన్ అభివృద్ధి, అసఫ్‌జాహీలు పట్టాభిషేకం చేసుకున్న చౌమొహల్లా ప్రాసాద సమూహం సుందరీకరణ మొదలయినవి జరిగిన తర్వాత, అసలే సుందరంగా వున్న జంటనగరాలు మరింత సౌందర్యంతో మెరిసిపోతాయి. అన్నిటికన్నా ముందు హుసేన్ సాగర్‌లోని గుర్రపుడెక్క మొక్కను తొలగిస్తే, నాలుగు చెరువులను తవ్వించినంత ఫలం. ఆ మొక్క దాదాపు చెరువంతా ఆక్రమించుకొని చెరువు అందాన్ని చెరచడమేకాక నీటిని కూడ చెరిచే ప్రమాదం వుంది.

**ఉపశ్రుతి:—**

"మా సంయుక్త షష్టిపూర్తికి తమరు దయచేయాలి" అని ఆహ్వానించారు. ఒకరు నన్ను. "సంయుక్త షష్టిపూర్తి ఏమిటి ? ఎందరు చేసుకుంటున్నారు ? ఇంతకూ మీకు అరవై ఏళ్లేమిటి ? మొన్ననేగా 32 అన్నారు" అన్నాను ఆశ్చర్యంగా. "అవునండీ! నాకు 32 నాభార్యకు 28 వెరసి 60. సంయుక్త షష్టిపూర్తి. పది సినిమాహాళ్లలో పదివారాలపాటు నడిచిన సినిమాకు సంయుక్త శతదినోత్సవాలు జరుగుతున్నప్పుడు, నేను సంయుక్త షష్టిపూర్తి చేసుకొంటే తప్పా ?" అని గుడ్లురిమాడు ఆయన.

— తిరుమల రామచంద్ర

## అవీ ఇవీ అన్నీ

### రంగులవల నవల

ప్రముఖ రచయిత శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు రాసిన నవలను ఖమ్మంపట్నంలో 27న శ్రీ కుందేం మహాలక్ష్మేశ్వరరావుకు అంకితం చేశారు. అంతకు పూర్వం జరిగిన నవల ఆవిష్కరణ సభకు శ్రీ వీరాజీ అధ్యక్షత వహించారు. నవలను పి. డబ్ల్యు. డి. సూపరింటెండెంట్ ఇంజనీర్ శ్రీ సి. ఎస్. గుప్తా ఆవిష్కరించారు. జిల్లా కలెక్టర్, శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ సభను ప్రారంభించారు. చీఫ్ ఇంజనీర్ శ్రీ సత్యనారాయణ ముఖ్య అతిథిగా హాజరైనారు. శ్రీ వి. అప్పలరాజు వందన సమర్పణ చేశారు. ఈనవలను గణేష్ పబ్లికేషన్స్, ఏలూరురోడ్, విజయవాడవారు ప్రచురించారు.

### అమృత ఫలాలు

అమృత ఫలాలు అనే ఖండకావ్యము మా కార్యాలయమును చేరింది. రచన శ్రీ పాదిలరాధాకృష్ణమూర్తి పేజీలు : 88 వెల 2.50 ప్రతులకు పి. వర్ ఆర్. ఆంజనేయులు, శివాలయంవీధి, మునిసిపల్ అప్పర్ ప్రైమరీస్కూలు, విజయవాడ 1కి వ్రాయవచ్చును.

### దేవుడులేని దేవాలయం

నాటకం, రచన శ్రీ అరిశెట్టి శివన్నారాయణ, 106 పేజీలు, వెల: 5 రూపాయలు. ప్రచురణ: ఆంధ్రరత్న బుక్‌డిపో, తెనాలి-2.

### ధర్మ సంరక్షణార్థం

స్త్రీ పాత్రలేని హాస్య, వ్యంగ్య, భయానక నాటిక, రచన మహమ్మద్ నఫీజుద్దీన్, 44 పేజీలు, వెల రు. 3-00, ప్రచురణ ఆంధ్ర రత్న బుక్ డిపో, తెనాలి-2.

### కాహళీ-కాకిగోల

"పురోగామి మూలధనం కోసం ప్రచురించిన కవితాసంకలనం. రచన శ్రీ చామర్తి దుర్గాప్రసాద్, 66 పేజీలు, వె : 5 రూపాయలు, ప్రతులకు పురోగామి డి. 18/15, ఐ. ఐ. టి. మద్రాసు-36.

### కోడె త్రాచు

నాటకము, రచన శ్రీ దగ్గుబాటి ముప్పలింటి 140 పేజీలు, వెల 5 రూపాయలు. ప్రచురణ ఆంధ్రరత్నబుక్‌డిపో, తెనాలి-2.

### ప్రేమబంధం-పెళ్లిసంబంధం

చిన్ననవల, రచన శ్రీ ఎస్. ఎం. ఖాసిం 44 పేజీలు, వెల: రెండు రూపాయలు, ప్రతులకు : శ్రీ పరమేశ్వరీ బుక్ షాప్, బస్‌స్టాండ్ వద్ద, ప్రత్తిపాడు, గుంటూరు జిల్లా.

### ప్రతిఫలం

యార్లగడ్డ సరోజినీదేవి రచించిన 'పరిష్కారం' సాంఘిక నవలను నవయుగ బుక్‌సెంటర్, ఏలూరు రోడ్, విజయవాడవారు ప్రచురించారు. 236 పేజీల ఈ నవల వెల రు. 8. ప్రతులకు ప్రచురణ కర్తలకు వ్రాయవచ్చు.

### కులిశధార

కులిశధార కవితా సంపుటి మా కార్యాలయం చేరింది. రచన: బండ్లమూడి సత్యనారాయణ. పేజీలు: 63. వెల: రు. 6.

### కాకస్వరాలు

బండ్లమూడి సత్యనారాయణగారిచేతనే రచింపబడ్డ కావ్య సంపుటిని కూడ ఇందుమతి ప్రచురణలు, ఏలూరు వారు వెలువరించారు. పేజీలు: 82. వెల: రు. 6.

### మణిమాల

మణిమాల ఆంధ్రీకృత పద్య సుభాషితములు మా కార్యాలయం చేరింది. దీని రచయిత బండ్లమూడి సత్యనారాయణగారే 40 పేజీలు గల ఈ పుస్తకం వెల రు. 2.50. పై మూడు పుస్తకాలకు ఇందుమతి ప్రచురణలు, నరసింహారావుపేట, ఏలూరు 534002 కి వ్రాయాలి.

### లేజస్సు నా తపస్సు

కవితా సంపుటి. రచన : డా. సి. నారాయణరెడ్డి, 58 పేజీలు, వెల 4 రూపాయలు

## అల - ఇల - అల

ప్రచురణ శ్రీ భారతీ పబ్లికేషన్, 4 హౌసింగ్ బోర్డు కాలనీ, బాలాపేట, హైదరాబాదు 500040

నిజమైన కవి ఎల్లప్పుడూ ప్రజాక్షేమాన్నే కాంక్షిస్తాడు సమాజంలోని చెడుని ఎదుర్కొని మంచిని పెంపొందింపజేయడానికి అతను చేసే కృషి తపస్సు అందుకే కవికీ ఋషికీ భేదం లేదు ఇద్దరి లక్ష్యమూ లోకకళ్యాణమే

ఈ కవితా సంపుటంలో వున్న 38 కవితలూ ప్రస్తుత సమాజంలోని పరిస్థితులకి అద్దం పడుతున్నాయి శ్రీ భారతీ పబ్లికేషన్ వారి తొలి కుసుమం యిది అయినా అందమైన ముఖచిత్రంతో, చక్కని ముద్రణతో నిండుగా వుంది

(—ఎం ఆర్.)

## స్వరబ్రహ్మ

లలితకళానికేతన్, రాజమండ్రి వారి ద్వాదశ వార్షికోత్సవాల సందర్భంగా వెలువరించిన శ్రీ కె వి మహాదేవన్ అభినందన సంచిక. ఇందులో సంగీత దర్శకులు శ్రీ మహాదేవన్‌గురించి పలువురు ప్రముఖులు వ్రాసిన రచనలు చక్కని గెటప్‌తో అందంగా ముద్రించారు ముఖచిత్రం, లోపలి రేఖాచిత్రాలని శ్రీ బాపు వేశారు



ముఖ్యమంత్రి జలగం వెంగళరావుచే గుడివాడలో మే 15న జరుపబడిన స్మాల్ ఇండస్ట్రీస్ ప్రారంభోత్సవంలో కూచిపూడి నృత్య ప్రదర్శనలో ఎనాపించి పంటుకున్న కుమారి వాణిశ్రీ


**Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar Vijayawada-3 Editor S Radhakrishna**

# అభిమానులెందఱో మీ ముఖానికి, శత్రువులెందఱో మీ చర్మానికి. పాండ్స్ వానిషింగ్ క్రీమును దగ్గరుంచుకోండి.

పాండ్స్ వానిషింగ్ క్రీమ్ గాలి, ధూళి, శీతోష్ణాల నుండి మీ చర్మాన్ని కాపాడుతుంది. చర్మంలోని తడి ఆరిపోకుండాచేసే హ్యూమెక్టెంట్ అనే విశేషపదార్థం అందులో వుండడంచేత చర్మానికి తళతళలాడే సౌందర్యం కలుగుతుంది.
అది జిగట లేక నున్నగా మిలమిలలాడే అందాన్ని అందిస్తుంది. దానిని నిండైన పౌడర్ బేస్‌గా ఉపయోగించండి. అది మీ అలంకరణను గంటలతరబడి తాజాగా, అందంగా ఉండేట్టు చేస్తుంది. లేకపోతే పరిపూర్ణ అలంకరణ సాధనంగానూ ఉపయోగించండి.
గుర్తుంచుకోండి—మీ లాగే మీ చర్మానికీ అనురాగం అవసరం.




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమిత బాధ్యతలతో యు.ఎస్.ఎ.లో సంస్థాపితమైనది.)

CP-1178

**Pond's**

కృష్ణ సమర్పించు పద్మాలయా ఆర్ట్ పిక్చర్స్



# రామరాజ్యంలో రక్తపాతం



ఈస్ట్‌మన్ కలర్

కథ-దర్శకత్వం: పర్వతనేని సాంబశివరావు * నిర్మాత: జి. ఆదిశేషగిరిరావు B.Sc,

స్క్రీన్‌ప్లే: జి. హనుమంతరావు * ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: యు. సూర్యనారాయణబాబు